# అడవి పగడాలు






రచన:

స్వర్ణ రాజ హనుమంతరావు



ఉదయ సాహితీ పబ్లికేషన్సు
విజయవాడ - 1

ఉదయ సాహితీ ప్రచురణ


*

ప్రథమ ముద్రణ :
ఆగస్టు 1962

*

వెల : రెండు రూపాయలు

*

సంపాదకులు :
పి. అర్జునస్వామి

*

ముద్రణ :
నవభారతీ ప్రెస్,
విజయవాడ _ 2.

నా ఆర్తిలో తను భాగం పంచుకుంటూ
నా కీర్తిపథానికి తన అరచేతులతో
మెట్లు కట్టాలని తాపత్రయపడే
మా సోదరి
పొత్తూరి కామేశ్వరీ దేవికి
ఆమె ఆరాధ్యదైవానికి.

ఇందులో……

సతీమణితో సైకిల్ సవారీ

అత్తవారింటికి

దైవనిర్ణయం

పండక్కి…

అడవి పగడాలు

బ్రతుకు తెరువు

చంద్రి…

---

ఇతఃపూర్వమే వీటిలో కొన్నింటిని తమ పత్రికల్లో ప్రకటించిన చుక్కాని, చేతన, నారీలోకం, ప్రజాసేవ మున్నగు పత్రికాధిపతులకు నా కృతజ్ఞత.

# సతీమణితో — సైకిల్ సవారీ

కొందరి స్వభావము మహా విచిత్రంగా వుంటుంది. చేసేపనిచాలా తప్పుపని అని అనిపిస్తున్నా, ఆపని తప్పకుండా చేసేసి తరువాత తరువాత ఎందుకు చేశామా అని అనుకుంటూ వుంటారు కొందరు. ఇంకా కొందరు చేసేపని సవ్యంగానే ఉన్నది అని తోస్తున్నాకూడా ధైర్యంతో చేయలేక తరుణము మించిన తరువాత "అరే అప్పుడు అల్లా చేసివుండాల్సింది"నుకుంటూ ఉంటారు. పోనీ యిటువంటి రకాల మనుష్యులు ఒకనాడో రెండునాళ్ళో తాము చేసినపని సమయస్ఫూర్తిగా లేదని తెలుసుకోగలిగినా కూడా తమ అలవాట్లను మార్చుకుంటారా అంటే మార్చుకోలేరు కూడా.

ఒకరి సంగతి వరకు ఎందుకు? నా మట్టుకు నేను కూడ (నా ఆత్మ పరీక్షలో) పైన చెప్పిన వాళ్ళలో మొదటి తరగతికి చెందుతానేమోనని నిర్ణయించుకుంటూ వుంటాను. పోనీ యిల్లా నిర్ణయించుకున్నానుకదా అని నా అలవాట్లు ఏమైనా మానుకుంటానా అంటే అదీలేదు. "పుట్టెకు పుట్టిన బుద్ధి పుట్టెడు కట్టెల్లో పెట్టితేగాని పోద"న్నట్లు అది మానవుల కందరరికీ సహజమే అయివుంటుంది.

ఇటువంటి విషయాలకు ఉదాహరణలు జీవితంలో చాలా ఎక్కువగా దొరుకుతాయి — వీటికై వెతకవలసిన పనిలేదు. కాలేజీలో ఫ్యాన్సీడ్రెస్ కాంపిటీషన్ లో ఆ వేషం వేస్తే ఏం బావుంటుందనుకున్న నేను ఆ బుడబుక్కల వేషమే

# సతీసంజీవితో--సైకిల్ సవారీ

కొందరి స్వభావము మహా విచిత్రంగా వుంటుంది. చేసేపని చాలా తప్పుపని అని అనిపిస్తున్నా, ఆపని తప్పకుండా చేసేసి తరువాత తరువాత ఎందుకు చేశామా అని అనుకుంటూ వుంటారు కొందరు. ఇంకా కొందరు చేసేపని సవ్యంగానే ఉన్నది అని తోస్తున్నాకూడా ధైర్యంతో చేయలేక తరుణము మించిన తరువాత "అరే అప్పుడు అల్లా చేసివుండాల్సింద"నుకుంటూ ఉంటారు. పోనీ యిటువంటి రకాల మనుష్యులు ఒకనాడో రెండునాళ్ళో తాము చేసినపని సమయస్ఫూర్తిగా లేదని తెలుసుకోగలిగినా కూడా తమ అలవాట్లను మార్చుకుంటారా అంటే మార్చుకోలేరు కూడా.

ఒకరి సంగతి వరకు ఎందుకు? నా మట్టుకు నేను కూడ (నా ఆత్మ పరీక్షలో) పైన చెప్పిన వాళ్ళలో మొదటి తరగతికి చెందుతానేమోనని నిర్ణయించుకుంటూ వుంటాను. పోనీ యిల్లా నిర్ణయించుకున్నానుకదా అని నా అలవాట్లు ఏమైనా మానుకుంటానా అంటే అదీలేదు. "పుట్టెకు పుట్టిన బుద్ధి పుట్టెడు కట్టెల్లో పెట్టితేగాని పోద"న్నట్లు అది మానవుల కందరకీ సహజమే అయివుంటుంది.

ఇటువంటి విషయాలకు ఉదాహరణలు జీవితంలో చాలా ఎక్కువగా దొరుకుతాయి — వీటికై వెతకవలసిన పనిలేదు. కాలేజీలో ఫ్యాన్సీడ్రెస్ కాంపిటేషన్‌లో ఆ వేషం వేస్తే ఏం బావుంటుందనుకున్న నేను ఆ బుడబుక్కల వేషమే

వేయకుండా ఉండలేకపోయినాను — మళ్ళీ ఆ బుడబుక్కల వేషము ఎందుకు వేశానని నేనే అనుకున్నాను - అల్లాఅని నేను మరుసటి సంవత్సరము కాలేజీలో పాములవాని వేషము వేయకుండా వుండలేదని చెబితే మీకు ఆశ్చర్యమేమీ వుండ దనుకుంటాను,

కాని కొన్ని కొన్ని విషయాలలో మన పెద్దవాళ్ళు అప్పుడప్పుడూ అంటూవుంటారు— పెళ్ళయితే పిల్లలు మారిపోతారనీ - వాళ్ళ అలవాట్లుకూడా మారిపోతాయనీ-- కానీ అది సర్వదా నిజంకాదని నేననను. కాని నా సంగతిలో మాత్రం ఆ మాట నిజం కాలేకపోయింది— కారణం మా శ్రీమతి, వనజకూడా నా క్యాటగిరీలో చేరడమే. "అతని కంటె ఘనుడు ఆచంట మల్లన్న" అన్నట్లు ఆవిడ యిటువంటి విషయాల్లో ఇంకా రెండాకులు ఎక్కువ చదివిందనే చెప్పాలి. తరువాత మనస్సులో ఎల్లా గుంజాటన పడినా ముందు మాత్రము "లోకులు ఏమనుకుంటే మనకేం" అని ముందడుగు వేసే ఆదర్శ నారీమణుల్లో మా ఆవిడకూడ ఒకతె అని నేను రాయిగ్రుద్ది చెప్పగలను.

నేను కూడ ఇటువంటి విషయాల్లో తక్కువ తిన్న వాణ్ణేమి (కాదని మీ కర్థమయి వుంటుందనుకుంటా) కాక పోయినా మాటవరుసకైనా అప్పుడప్పుడూ అంటూవుంటాను మా శ్రీమతితో "ఇంకా మనమేమైనా చిన్న పిల్లలమా? ఆలోచననేదేమీ లేకుండా కుర్ర చేష్టలు చేయడానికి"ని. కాని మా వనజ మాత్రము పూర్వకాలంలో తెనాలి రామ కృష్ణుడితోనూ, ఈ కాలంలో మునిమాణిక్యంవారి "కాంతం"

తోనూ పోల్చతగ్గది కనుక నవ్వుతూనే "మీరూ నేను, అమ్మా నాన్న అయిన రోజున అందురుగాని లెండి ఆ మాట. ఇంకా ఈ రోజుకు మీరూ నేనూ కూతురూ, కొడుకులుగానే వుండి పోయాము"ంటూ ఉంటుంది, మాకు పిల్లలు లేకపోవటం కూడా ఒక గొప్పగానే తీసుకుంటూ — ఇటువంటి ఛలోక్తులు మా శ్రీమతి నవ్వుతూ విసిరినప్పుడు నేను ఏమైనా సమాధానము చెప్పి ఆవిడ చెప్పినది తప్పని లాజికల్‌గా గెలువగల్గినా కూడ నేను ఆవిడతో వాదించను — కారణము - ఆవిణ్ణి నేను మాటల్లో జయించలిగినా ఆవిడ నామనస్సునే జయించింది. అందుచేతనే మా సంసారిక ప్రపంచ ప్రభుత్వంలో ఆమె ఏ విధమైన ప్రపోజల్ పెట్టినా నేను "సెకెండెడ్ బైమీ" అంటూ వుంటాను. నా యీ సుగుణాన్ని ఆధారంగా చేసుకొని మా శ్రీమతి బలే బలే ప్రోగ్రాములు వేస్తూ ఉంటుంది.

మొన్న నీ మధ్యోనారి మేము ఉంటున్న ఊరికి దగ్గరలో వున్న మా బాబాయిగారింట్లో ఏదో శుభకార్యమైతే ఆయన మమ్మల్ని అక్కడకు రమ్మని చెప్పివెళ్ళటానికి వచ్చాడుట. ఆ సమయంలో నేను ఆఫీసుకెళ్ళాను. సరే ఆయన వచ్చి రమ్మనమని చెప్పేసరికి "మీ అబ్బాయి లేరుగదా వచ్చిన తరువాత చెప్పుతా"నన్నదిట మా శ్రీమతి. ఆయన మాత్రమేమి సామాన్యుడు! "నీవు చెబితే మావాడు వినడు గనుకనా? మా వాడు వచ్చేవరకు నాకు టైము లేదు. ఎవరొచ్చినా రాకపోయినా మీరు వస్తారని మేము అనుకున్నాము. అందులో యింకెవర్ని పిలవటానికి టైం లేదు. సాయంత్రమే

బయలుదేరి రండ"ని "నీవు చెబితే వినకపోడు లే"మ్మని చక్కా ఆయన వెళ్ళిపోయాడు.

ఇంకేముంది, సత్యభామ చేతిలో కృష్ణుడిలాగా ఆమె చెప్పినట్లు నే వింటాననేసరికి మా ఆవిడ హృదయారవిందము పరమానందమున వికసించి ఒక ప్రోగ్రాము అరేంజి చేసేసి నా రాకకు ఎదుకు చూస్తూ కూర్చుంది.

శనివారం సాయంత్రం రోజూకన్నా పెందరాడే రావాలున్నా నేను కొంచెము ఆలస్యంగా గాని రాలేదు. తీరా నేను ఇంటికొచ్చేసరికి మా శ్రీమతి ప్రయాణానికి సిద్ధమై కూర్చొని కార్యక్రమం ఎనౌన్సు చేసింది.

కాదనటము మన పద్ధతే కాదుగా! అందుకని ఆవిడ పెట్టిన టిఫిన్ తినేసి బట్టలు మార్చుకొని నా వాహనము (అంటే ఏమీ లేదులెండి, నా ర్యాలీ సైకిల్) తీసుకొని బయటకొచ్చాను - గబగబా తాళంవేసి బయలుదేరి వచ్చేసింది మా శ్రీమతి. కబుర్లు చెప్పుకుంటూ చవితి వెన్నెల్లో పోతూవున్నాము. నేను బండి తెస్తానన్నా, వెన్నెల్లో నడుస్తానని అన్నది ఆవిడ, నేను మాట్లాడకుండా ఊరుకొన్నాను. కానీ నేను మాత్రం చేతిలోవున్న సైకిల్ ఎందుకుపయోగించకూడదని ఎక్కి కూచుని ఆవిడ నడకకంటె కూడా మెల్లిగా సైకిలు పోనిస్తున్నాను. వెనకనుంచి మల్లెపూలతో మెరిసే మా శ్రీమతిని చూస్తే నా కప్పుడు అచ్చరల అందం కంటే మా ఆపిడ అందం ఏమి తీసిపోతుం దనిపించింది.

ఇంతలో నా ఊహాలోకాని కడ్డుతగులుతూ "మీరు సైకిల్ మీద కూర్చొని వస్తూంటే నాకు కాళ్ళు నొప్పులుగా

ఉన్నాయి! దిగి కబుర్లేమయినా చెప్ప కూడదూ" అని అడిగింది శ్రీమతి. దీనికితోడు మా ధూమపాన దేవత జ్ఞాపక మొచ్చి గబక్కున సైకిల్ దిగి సైకిల్ మా శ్రీమతి కిచ్చి నేను సిగరెట్టు కాల్చుకుంటూ ఉంటే ఆవిడ సైకిల్‌ను అదో ప్యాషనుగా పుచ్చుకొని మరోవైపుకు తిరిగి ఏదో ఆలోచిస్తూంది.

ఇంతలో నా జ్ఞానకాష్ఠము వెలిగించి నేనటు చూస్తే నాకొక ఆలోచన తట్టింది. గబగబా దగ్గరకుపోయి కుడిచేత్తో మా శ్రీమతి నడుంచుట్టూ చేయి పోనిచ్చి ఎడమ చేత్తో సైకిల్ హేండిల్ పట్టుకొని ఆమెను సైకిల్‌బార్ మీద కూర్చో బెట్టాను.

"అబ్బ ఏమిటండీ" అందామె.

"సైకిల్" సమాధానమిచ్చాను నేను.

"ఆ సంగతి నాకూ తెలుసు! రోడ్డు మీదనా మీసరసాలు" అందామె కోపం నటిస్తూ." ఇంతలో సరసమేముంది అంటూనే నేనుకూడ సైకిలెక్కి కూర్చున్నాను. వెన్నెలకు కొంచెము మేఘాలు అడ్డువచ్చి మసక మసక పడుతోంది. సైకిల్ మంచి స్పీడులో పోతూంది – కొంచెంసేపు ఆమె ఏమి మాట్లాడలేదు.

కొంచెం సేపుండి "ఏమండీ" అని పిల్చింది.

"ఏమిటో ధర్మసందేహ" మన్నాను నేను.

"అబ్బ అదికాదండీ, ఎవరన్నా చూస్తే" అంటూ నా వైపు తిరిగింది.

"ఏంచూస్తే" అంటూ నావైపు తిరిగిన ఆమె బుగ్గమీద ఒకచిటిక వేస్తూ "కదలకుండా కూర్చో" అన్నాను.

ఇంతలో ఆమె దృష్టి నా భుజం మీద వున్న నా మఫ్లర్ మీద పడింది. ఇంకేం అది తీసేసి తన తలకు ఠీవిగా చుట్టుకొని కూర్చొన్నది.

"ఇంకేం, తెల్లచీరె నువ్వూ! అచ్చు మొగవాడిలాగా ఉన్నా"వన్నాను నేను, జడమాత్రం స్పష్టంగా తాచుపాములా కనపడుతున్నా.

మీ ఉపమానాల కేమిగాని ఆ జవహర్ కోటుకూడ ఇవ్వండని" సైకిల్ మీదనే నా కోటు విప్పించి ఠీవిగా ధరించి కూర్చొన్నది.

"ఇక సరిగ్గ కూర్చో"అని నేను సైకిల్ నేను గబగబా పోనిస్తూవుండగా దారిలో బాబాయ్ ఏవోఏవో సరుకులు తీసుకొని మాకోసమే కామాసు వెనక్కి వెనక్కి చూస్తూ వెళుతూవున్నాడు. మా శ్రీమతి చూచి కొంచెం బెదరి "ఏమండీ" అంది.

"అరవబోకు! మ ట్లాడకుండా వెళ్ళదామన్నా నేను.

తీరా దగ్గరకొచ్చిన తరువాత ఆయన మేము ఎవరో అనుకొని "వెనకాల జట్కా ఏమైనా వస్తోందా నాయనా" అని అడిగాడు మమ్మల్నుద్దేశించి.

మా ఆవిడ కిక గుండెల్లో రాయపడ్డట్లయి మెల్లిగా సైకిల్నించి జారటం మొదలు పెట్టింది. వెంటనే ముందు ఆవిణ్ణి, చేత్తో నొక్కిపట్టుకుని ఏమీ ఎరగనట్లుగా "ఎవరు?

బాబాయి నువ్వేనా ? మసకమసకగా వుంటే ఎవరో అనుకు న్నాను" అన్నా. సైకిలు కొంచెం ముందుకు పోనిచ్చి "అరే నేను మీరు వస్తారనే చూస్తున్నా! కోడలేది" అన్నాడు ఆయన మామూలు ధోరణిలో! అంతవరకు మామూలుగా కూర్చున్న శ్రీమతి మళ్ళీ నావంక తిరిగి అదోరకంగా చూసింది, కాని నేనదేమీ చూడనట్లుగా "కాదు బాబాయి మీకోడలున్నా. ఇదిగో ఈ సైకిల్ మీద వున్నాడే ఆయన భార్యా వాళ్ళంతా ముందే బండిలో వెళ్ళారు ఆయన మా క్లార్కు" అని చెప్పి మళ్ళీ అట్టే సేపు అక్కడవుంటే బాగుం డదని "బాబాయి యిక నేను వస్తా. మళ్ళీ వాళ్ళ వాళ్ళకి ఊరు కొత్తట అందుకని అయన తొందర పడుతున్నాడ"న్నాను.

"అల్లాగా యింతకీ వాళ్ళు ఎవరి తాలుకు చెప్పావు కాదు" అన్నాడాయన సంభాషణ పొడిగిస్తూ.

మాఊరి కరణం గారికి మేనల్లుడవుతాడితను" అంటూ నేను వస్తానని తుర్రుని సైకిల్ పోనిచ్చాను.

"అబ్బ, నయం! ఏం చెబుతారో అని భయపడ్డాను" అందామె యింకా భయంగానే.

"అంత భయపడితే ఎల్లాచెప్పు వనజా సర్దాగా ఎక్క- కూచ్చున్నాననుకో!"

"ఎవరు నేనా కూచ్చుంది?"

"పోనీ నేనే కూర్చోబెట్టాను. అందుకని సమయము వచ్చినప్పుడు సమయస్ఫూర్తిగా నాటక మాడాలిగాని అప్పుడు

క్రిందికి దిగాలని జారితే ఏమయ్యేది ?'' అన్నాను నేను కొంచెం విజయ గర్వంతో.

"పోనీలెండి" అంటుండగాగానే ఊరు బయట కొచ్చేశాము. నేను బ్రేకువేసి దిగమనే సరికి మా శ్రీమతి దిగుతూ "అబ్బ ! నా కాలు తిమ్మిరి పట్టిందండీ! అసలు నడిస్తేనే బాగుండేది " అన్నది కాలుసరిచేసుకుంటూ.

"ఏం, కాలు తిమ్మిరి పట్టిందనా"?

"అందుకు గాక పోయినా, మీ రప్పుడు మీ బాబా యేగదా అని చబితే నా కెల్లా ఉండేదండీ" అన్నది ఆమె మఫ్లరు, జవహారు కోటు నాకిచ్చేస్తూ.

"అంతభయం కలదానివి కనుక నేనా సైకిల్ ఎక్కించిందే తడవుగా దిగుతానన్నైనా గట్టిగా అనలేదు" అన్నాను నేను.

"అంటే మట్టుకు మీరు దిగనిస్తారా ఏమిటి " ఆవిడ నా ముఖం వంక చూసి అడిగింది.

"అంటే మాత్రం నిన్ను దింపేసేవాణ్ణే" అందామనుకున్నా ఆవిడ ముఖం చూసి ఎందుకనో.

"అయినా అయిపోయిన తరువాత అనుకోవటం మనకు మామూలేకదా. ఏమంటావ్ వనజా?'' అనేసిప్పాళ్ళోకి నడిచాను.

" ఏం బడాయండీ '' అంటూ వనజ నా వెంట హంస నడకలు నడచింది.

—0—

# అత్తవారింటికి

ఇన్నాళ్ళ నుంచీ ఎదురుచూసిన ఆ రోజు రానే వచ్చింది. కాని సీతికి ఇన్ని దినాల్నుంచి కంటున్న కలలకంటే తండ్రిని, తమ్ముణ్ణి, చెల్లెళ్ళనీ వదిలి వెళ్ళటమే కష్టమనిపించింది! అనేక రోజులుగా అనుకుంటున్న విషయానికీ, ఈ రోజు తన హృదయంలోనుంచి పొంగిపోతున్న భావాలకూ, సహస్ర తేడా వుంది. ప్రతిరోజూ ఈనాటితో తన కష్టాలు గట్టెక్కినట్లే ననుకొంది. కాని ఈ రోజున సీతికి ఆ కష్టాలు రేపట్నుంచీ తన చెల్లెళ్ళూ, తమ్ముడూ పడాలనే విషయం జ్ఞాపకం వచ్చేసరికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఎవరికీ కనపడకుండా కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ వుండగానే - ఆనందంగా చిందులు త్రొక్కుకుంటూ వచ్చి అదో విధంగా సీతివంక చూశాడు కోటిగాడు...సీతి పాపం తలదించేసుకుంది. కాని కోటిగాడు వెంటనే అందుకున్నాడు. "ఏహేయ్! ఏడుస్తుండావు యింకా? ఇదిగో నాతోటి రావటం నీకిష్టం లేదట్టుందే!" అన్నాడు.

సీతి కింకా కోటిగాడితో ఎదురుగా మాట్లాడే చనువు గాని, ఎదురు సమాధానం చెప్పే చనువు గాని రాలేదు. అయినా అసలా పరిస్థితిలో ఏమీ మాట్లాడాల్సిందంటూ లేదనిపించింది. ఏమనుకున్నాడో ఏమో కోటిగా డక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఎండెక్కుతోంది. గంజివుడకేస్తేనే గాని పిల్లలకు పడేసేందుకు వుండదు. అందుకని సీతి గబగబా అన్ని పనులు చేస్తోంది మొదటిరోజుల్లో యీ పనులు తిన్నగా చేయ సందుకే తండ్రి చచ్చేట్లు కొట్టేవాడు. తల్లి చచ్చిపోయే సరికి సీతి పదేళ్ళ పిల్ల. తండ్రితోబాటుపోయి జీవాల్ని (పందుల్ని) మేపుకొస్తూ వుండేది. ఆ రోజుల్లో చెరువులోకలేశాడలు, దుంపలు, తీసి జీవాలకు వేయటమంటే సీతికి సరదాగా వుండేది. కాని ఆ సుఖజీవితపు రోజులు తల్లి చావుతోనే అంతరించి పోయినయ్, ఆ రోజు నుండి మామూలుగానే కామందా దెబ్బలు తినేందుకు, చాకిరీ చేసేందుకు కూడ సీతి పెద్ద బిడ్డయింది.

మొదట్లో కష్ట మనిపించినా రాను రాను అదే పని పాట్లు సీతికి కలవాట్లై పోయినై. అందుకనేమీ కష్టమనిపించ లేదు. కాని తరువాత తరువాత అదో రకమైన దిగులు బయ ల్దేరింది సీతిలో. అది దిగులనటానికి వీలులేదు. తండ్రిమీద కొంచెంగా కోపమని చెప్పవచ్చు. తల్లిలేని బిడ్డల్ని సాకేందు కని మనఃపూర్వకంగా తండ్రి తనకు పెళ్ళిచేయకుండా — కనీసం పెళ్ళి ప్రయత్నం చేయకుండా వుంచుతున్నాడన్నది తేలటంతో సీతికి తండ్రి మీద కోపం రగులుతూ వుండేది. వూళ్ళో కోనయ్య గారమ్మాయి-తనకంటే చిన్నది -రెండేళ్ళ క్రితమే సొంకెల కావిళ్ళు సాగిపోతూవుంటే వెనక కారులో అత్తవారింటికి వెళ్ళటం తలచుకున్నప్పుడు మనస్సు చివుక్కు మనేది సీతికి.

అంతో యింతో అందరూ చివాట్లువేస్తే సీతిని కోటిగాడికిచ్చి పెండ్లి చేశాడు ముత్తడు. కోటిగాడు భార్యను తీసికెళతానని వచ్చి కూర్చున్నాడు మూడు రోజుల్నాడు. నాలుగు రోజులుండి పొమ్మన్నాడు ముత్తడు కోటిగాణ్ణి. మొదట్లో విన్ననాడు కోటి బావ వెంటపోవటం ఎంతో సంతోషాన్ని రేకెత్తించిన విషయమైనా మెల్లిగా ఎందుకో చాలా బాధాకరంగా కనిపించింది సీతికి.

తల్లి లేని సంసారాన్ని బిడ్డగా కాక తల్లిగా సాకింది సీతి. ఈ సంసారం యిప్పుడు తనదిగా భావిస్తోంది సీతి. గంపెడు సంసారం తండ్రిమీద వదలిపోతే ముసలితనంలో తండ్రి ఏమవుతాడో ఏమో! ఈ విషయాలు సీతి అమాయకపు గుండెమీద బండ పెట్టినట్లయినయ్.

ఇంతలోకి తమ్ముడు జీవాల్ని తోలుకొని వచ్చాడు. అక్క వెళుతోందన్న విషయం వాడి కెందుకో చాల ఆనందంగా వుంది "గంజెయ్యవే నేనుకూడ ఆడదాక వస్తాను" అన్నాడు వాడు.

"అయ్యొస్తా డుండు, ఆడికి, నీకు, మీ బావకి అందరికీ ఒక్కసారే యేస్తాను" అంది సీతి.

ఇంతలోకి ముత్తడు రానేవచ్చాడు. అమ్మడానికి పట్టుకెళ్ళిన ఆరు బుట్టలలో రెండు యింటికే తిరిగొచ్చినై. అందులో ఒక బుట్టలో కాసిని ఎండు మిరపకాయలు, కొంచెం వుప్పు, వుల్లిపాయలు వున్నయ్. బుట్ట చేతికిస్తూ "ఏదన్నా కూరొండు సీతీ"! అని పురమాయించాడు ముత్తడు

సీతి చెల్లెల్ని పిలిచి వుల్లిగడ్డలు తరగమంది. కాని అది మారాముచేస్తూ "నాకు చేతకాదే" అంది ఇవ్వాళ్టికి తనుచేస్తుంది; కాని రేపన్నుంచి... ఈ విషయం జ్ఞాపకం వచ్చేసరికి సీతికి కళ్ళు చెరువులయిపోయినయ్.

"అమ్యా" అని పిలిచింది.

"ఊఁ" అన్నాడు ముత్తడు.

"రేపటినుంచి కూరలు అవీ నీవే చెప్పి చేయించుకో. చెల్లెల్ని కొట్టబోక" అంది కళ్ళనీళ్ళతో.

"ఎందుకు కొడతా లేవే! నాకు తెల్దూ ?" అన్నాడు ముత్తడు నాలుక చివర్నుంచే.

రేపటి నుంచీ ఎల్లెట్లా చేసుకోవాలో అన్నీ చెల్లెలికి చెబుతూ కూర వండి అందరికీ పెట్టి తనుకూడ నాలుగుమెతుకులు గతికింది సీతి.

"ఎండెక్కిపోతుంది మామా! చప్పున ప్రయాణం కావాలి" అంటున్నాడు కోటిగాడు. అంత తొందర చేస్తున్నందుకు కోటిగాడిమీద ఎంత ప్రేమవున్నా ఆ సమయంలో మాత్రం లోలోపల చాల విసుక్కుంది సీతి.

అందంగా ప్రత్యేకంగా అల్లుకున్న పెట్టిగంపలో సీతి తన బట్టలు కొంచెం అక్కడక్కడా చిరిగినవి రెండు జతలు— మడచి పెట్టింది. కొత్తగా కాపురాని కెడుతుందని ముత్తడు రెండు రోజులముందే తెచ్చిన కొత్త చీర పసుపు అంటించి కాళ్ళకు పసుపు రాచుకొని కట్టుకొని, బొట్టు సరిదిద్దుకొని నిలబడింది.

ప్రయాణానికి సిద్ధమైనట్లేనా అన్నట్లు చుర చుర చూస్తున్న కోటిగాడు కొంచెం శాంతం వహించి బావమరిదిని "మీ అయ్యని పిలవరా ఇక బయలుదేర్తాము" అన్నాడు.

ఇంతలో ముత్తడే అక్కడికి వచ్చాడు. ఏదో గొణుక్కుంటూ వస్తూనే "లచ్చీ! ఎక్కడేడుస్తుండావే!" అన్నాడు. లచ్చి బిత్తరపోతూ వచ్చి నిలబడింది.

"అదేదో పని తొందరలోవుంటే నీవన్నా మెయ్యగూడదంటే చిట్టు నీళ్ళలో జీవాలికి. ఇప్పుడు అయ్యోటా నీళ్ళు తాగాలి. రేపటినుంచి యిట్టయితే నేనెట్టా సావనే"అన్నాడు. అప్పుడుగాని జ్ఞాపకం రాలేదు సీతికి తాను చిట్టుకలిపి వుంచలేదని. కోక దోపుకుంటూ గబగబా చిన్న బుటికలో చిట్టు నీళ్ళకుండలోపోసి కలుపుతూవుంటే "కొత్త కోకతో నీవెందుకు, లేలే! నేనేసత్తా"నంటూ చిట్టు కలిపేశాడు ముత్తడు.

పిల్ల లేగాకుండా జీవాల విషయం కూడ జ్ఞాపకంవచ్చి సీతికి మనస్సంతా భారమైపోయింది. ఏమీ మాట్లాడకుండా గుడిసె ముందుకొచ్చి నిలబడింది సీతి. జీవాల్ని దొడ్లోకి తోలి ఏదో ఆలోచించుకుంటూ సీతి వెనకాలే వచ్చి నిలబడ్డాడు ముత్తడు. ముత్తడి కేమిటో వళ్ళంతా సీరసించి, కుప్పయిపోతున్నట్లనిపించింది.

మౌనంగా నిల్చున్న తండ్రికూతుళ్ళమీద సానుభూతిగా కొంచెంసేపు చూసుకున్న కోటిగాడు మరుక్షణంలో బావమరిదిని "వీరన్నా! మూఅప్పపెట్టి ఎత్తుకురారా అందాక" అన్నాడు. వాడు మరుక్షణంలో ఈతపేళ్ళతో అల్లిన బుట్టతో

ప్రత్యక్షమై "నేనూ అప్పతో పొలిమేరకాడకి యెళ్ళొస్తా" నంటూ ముందుకు నడిచాడు.

ఇదే అదననుకొని "మాపూ! వెళ్ళొస్తా" మన్నాడు కోటిగాడు.

"ఊఁ! జాగ్రత్త" అన్నాడు ముత్తడు.

"అయ్యా" అంది సీతి. "ఎళ్ళొస్తా" అందామనుకుంది కాని ఆ మాట గొంతులోంచి బయటకు రాలేదు. ఏదో చెబుతుందనుకున్న సీతివంక ఒక్క క్షణం చూసి "ఏంటి సీతీ, చెప్పవేఁ!" అన్నాడు భారంగా ముత్తడు.

"ఎళ్ళొస్తానయ్యా" పెద్ద పెట్టున ఏడ్చింది సీతి మాటలతో బాటు.

"సీతీ" గావురుమన్నాడు ముత్తడు. పిల్లలు గొల్లుమన్నారు.

ఇంతలో కోనయ్య గారటుపోతూ అక్కడ ఆగి "ముత్తమా! ఏమిట్రా ఏడుస్తున్నారు. ఏమిటీ గొడవ" అని పలుకరించాడు.

"ఏముంది బాబూ! పెద్దది కాపురాని కెళుతోంది. సిటికెడు పసుపూ కుంకుమ యిచ్చే దిక్కు లేకపోయింది. దాని తల్లి వుంటే అన్నీ అది సూసుకుండేది. పోలేక అది, పంపలేక నేను, వదల్లేక వాళ్ళు..." అన్నాడు ముత్తడు.

"ఆరి పిచ్చిముండాకొడకా! తప్పౌతుందట్రా! సీతీ! లక్షణంగా వెళ్ళక ఏమిటీ అది. తప్పుకాదూ?" అని జేబు

తడిమి "ఇదిగోరా, చూడు మూడుపావలా లున్నాయి. ఊఁ! పట్టుకెళ్ళి దానికియ్యి" అని అక్కడినుంచి కదిలాడు.

"బాబూ ! మా అయ్యవాళ్ళని ఒకకంట కనిపెట్టి వుండండి" అని చెబుదామనుకుంది సీతి "అమ్మో! ఆయనతో ఆ మాట పెద్దదాన్నిలాగ నేను చెప్పగలనా?" అని వూరుకుంది

ముత్తడు మూడు పావులాలు సీతి చేతిలోపెట్టి "యిదే సారెలు, యిదే చీరెలు జాగ్రత్త సీతీ" అని "జాగ్రత్తరా కోటీశు ఇక వెళ్ళిరండి" అన్నాడు.

"అట్లాగే" అంటూ కోటిగాడు కదిలాడు.

అదే అనాలనుకుందిగాని సీతి అనలేక యిటూ అటూ కలయజూచి యిల్లు కదిలింది. అప్పపక్కనే నడుస్తున్నాడు చిన్నవీరడు.

ఇల్లు కదిలిన దగ్గర్నుంచీ ఏదో అఘాతం ఏర్పడుతోం దనిపించింది శీతికి. ఒక్కొక్కటిగా అన్నీ గుర్తుకు తెచ్చుకుంటూ మౌనంగా, మందంగా నడవటం మొదలెట్టింది.

అప్ప కబుర్లు చెబుతుందని వచ్చిన చిన్నవీరడు అప్ప బాధ చూసి తనూ మాట్లాడలేక "యిక యెళ్ళనేమే" అన్నాడు అప్పటికిగాని జ్ఞాపకంరాలేదు సీతికి వాడుకూడ వస్తున్నాడని.

"అరె! మరచిపోయానయ్యా! యింకింటికెళ్ళి కొంచెం కూడు తినుపో! ఇందాక సరిగా తినాలా" అంది.

"సిటికిలోకి ఎళ్ళనంటే" అన్నాడు. కాని పెట్టిబుట్ట కోటిబావ కిచ్చి అట్లాగే నిలబడ్డాడు. అప్పటికప్పుడు వాడికీ దుఃఖంవచ్చింది. ఇందాకణ్ణుంచీ వాళ్ళేడుస్తుంటేలేంది ఇప్పుడు పొంగుకొచ్చి "అప్పా!" అన్నాడు ఒక్కసారిగా.

"ఆరి ఎదవ! యిందాకణ్నుంచి సిందులు త్రొక్కి నీవూ ఏడిశావ్. తూత్" అన్నాడు కోటేశు.

చేతిలోవున్న ముప్పావులాలో మూడణాలు తీసి ఏమిటో కొనుక్కోని పొమ్మని చేతిలో బెట్టొంచింది సీతి. వాడు అప్పదగ్గర తీసుకోనలేక, అప్పతో వద్దనలేక చివరకు తీసుకోని వూరువైపు తిరిగాడు.

సీతి "వెళ్ళయ్యా" అని రెండడుగులు ముందుకు వేసి వెనక్కు తిరిగి చూసింది. వీరడు వెనక్కి తిరిగిచూశాడు. ఇద్దరూ మళ్ళీ నిలబడిపోయారు.

"వీరడు!..." సీతి పెద్దగాపిలిచింది. పొలిమేర దద్ద రిల్లింది.

"కాదప్పా! ఎళ్ళిపోతా! యికచూడనులే" అని గబ గబా ఎళ్ళిపోయాడు వీరన్న. సీతి "వీరన్నా, వీరన్నా" అని పిలుస్తూఅటు వేపుకు తిరిగి నిలబడిపోయింది.

కోటేశు సీతి దగ్గరగావచ్చి "సీతీ! యిక నడూ" అన్నాడు. సీతి మాట్లాడలేదు "అదిగో డొంకమలుపు కొచ్చాము ఎండ ఆట్టేలేదు! సూడు...యింకా సానా దూరం నడవాలి! మనకేం బండి పయ్యాణమా?..." అన్నాడు మెల్లిగా.

అప్పుడూ మాట్లాడలేదు సీతి.

"పోనీ యీడ ఓ నిమిషం కూకుందాం" అన్నాడు. కోటీశు. సరేనన్నట్లు ఊరుకుంది. సీతి, కోటీశు కూర్చున్నారు. కోటీశు అన్నాడు "సీతి! నేనంటే కోపమా? నేనేటి సేశాను! సెప్పు! నీకు నా కాడవుంటే బాగోదా? చెప్పు!" అన్నాడు దగ్గరగా జరిగి.

సీతి మెల్లిగా ఆలోచించుకొంది. "కోటిబావ చేతుల్లో తనకేమిటో సుఖంగానే వుంటుంది. కానీ...అయ్యా... జీవాలు...లచ్చి ... దిగువవాళ్ళు...వీరన్న...వీళ్ళందరితో పాటు వున్నప్పుడు తనకెంతో మనస్సు తేలికగా వుందనిపించింది."

కోటిగాడు కొంచెసేపు చూసి "సీతీ! యిక వెడదామా" అన్నాడు చేయిపుచ్చుకుని.

కోటీసు వైపుచూసి సరే అన్నట్లు తల ఊపిందిసీతి. కోటీశుముఖం అంత అయింది. ఇద్దరూకలిసి ఇంటివైపు నడిచేరు!...

—o o—

# దైవనిర్ణయం

"రామం! రామం! నిన్నేనోయ్! తలుపుతియ్యి"

'బాబూ! మేస్టారొచ్చార్రా! నిన్ను చూడ్డానికి మేస్టారొచ్చారు. తలుపుతియ్యి.'

రామచంద్రరావు తలుపు తీశాడు లోపలికి వచ్చిన మేష్టార్ని చూస్తూనే–

'మేస్టారూ' ... అన్నాడు. అతని గొంతుక పెగల్లేదిక. కళ్ళ వెంట నీళ్లుతిరిగినై.

'అరె! అదేమిటోయ్ అంత పిరికి వాడవవుతావ్ చిన్నపిల్లవాడిలాగ......'

'కూచోండిమేస్టారు......' రామం కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు. రామంతండ్రి స్టూలొకటి తెచ్చి దగ్గరగావుంచి వెళ్ళి పోయాడు.

'నా కీవిషయం అలహాబాదులో వుండగా తెలిసింది. కాని ఈ నెలరోజుల్నుంచి రావటానికి వీలుచిక్కిందికాదు. ఉత్తరం వ్రాయటానికి ఏ హాస్పటలులో వున్నదీ తెలియదు. కాని ప్రతిరోజు నిన్ను గురించే తలుచుకునేవాణ్ని' అన్నారు మేస్టారు కూర్చుంటూ.

'ఎన్ని అనుకొని ఏంలాభం మేస్టరూ, ఇక రామచంద్రరావును ఏ ప్లేగ్రౌండ్సులోనుచూచేవీలులేదు. మీరునన్నెంతగానో చూచుకున్నారు. నాశరీరానికి సౌష్టవంతోపాటు నాకు శాశ్వతమైన పేరును తెచ్చిపెట్టడానికి మీ జీవితాన్ని ధార

పోశాను. కాని ఏం లాభం చెప్పండి. ఆపదువును కాపాడు కునే భాగ్యం లేకుండా చేశాడు భగవంతుడు' తలవంచుకుని కూర్చుని మేష్టారివంక చూడకుండా అన్నాడు రామం.

'చూడు రామచంద్రరావు! ఒక్క మాట చెబుతు న్నాను విను. నీకు కాలు విరిగి పోవటం విచారింపవలసిన విషయం కాదని నేననుగాని గ్రుడ్డికంటె మెల్లనయంకదూ! నీకాలు పోయిందని నీవు ఎంత విచారపడుతున్నావో నేనూ అంత విచారపడుతున్నాను. ఈ వ్యాయామము, ఈ ఆటలు, పోటీలు యివన్నీ నీలాంటి ఉత్సాహవంతులైన కుర్రాళ్ళు లేక పోతే నేను మటుకు చేయకలిగింది ఏమైనావుందా? నీవు నావెంట తిరుగుతున్నంతకాలం నా విద్యార్థిగా చూసుకో లేదు. అఖిలభారతంలో పోటీచేయడానికి ఒకవ్యక్తిని తయారు చేస్తున్నానని గర్వపడేవాణ్ని. నీవు యిలా దిగులు పెట్టుకొని పోగొట్టుకున్న కాలుతోబాటు నీ ఉత్సాహాన్ని కూడ పోగొ ట్టుకుంటే ఎలా!'

'మిమ్మల్ని అర్థం చేసుకున్నాను మేష్టారూ! కాని యిది నాలో గూడుకట్టుకునిపోతూ వుంది. బట్టను వంకెకు తీసికొనిపోయి తగిలించినట్లు నాయావజ్జీవిత సమస్యను ఎలా అవతలకు నెట్టివేయగలను చెప్పండి!'

'కానీ తప్పదు. నెట్టెయ్యడానికి ప్రయత్నం చేయాలి. కనీసం ప్రయత్నంచేస్తానని అను. అంటే నీవు తప్పకుండా చేస్తావు; చేసి గెలుపొందుతావ్. మరి ప్రయత్నం చేస్తానను.'

'చేస్తాను'

'కాదు, అనాలి నాకోసం. అనకపోతే యిక్కణ్నుంచి లేవను'

'తప్పకుండ నాచేతనయినంత వరకు ప్రయత్నిస్తా'

♦ ♦ ♦

'హలో రామం! అరె! పాపం ఎంతగా చిక్కిపోయావురా! హాస్పిటల్ నుంచి "రిలీవు"చేసి నెల రోజులైనా నీవింకా కోలుకోనే లేదన్నమాట. ఏది నీ కాలు చూపించు'

'నా కాలు మాటకేం లేరా. వెధవమొండికాలు చూపిస్తానుగాని కాస్త కూచో ముందు. ఎక్కడనుంచి రావటం. ఏమిటి విశేషాలు.'

'విశేషాల కేంలేరా! తర్వాత చూద్దాం. అసలు నీపరిస్థితికి నీ విన్న ప్రశ్నలు వేస్తావనుకోలేదు. పాపం మేష్టారు నిన్నంతా నీ గురించే చెప్పారు. ఇక ఒక నిమిషంకూడ వుండా లనిపించలేదు. సరదాగా రెండు రోజులు టౌనులో గడిపి పోదామని వచ్చినవాణ్ని యిక యిక్కడకు బయల్దేరాను. అక్కడ ఒక్క నిముషం వుండబుద్ధి కాలేదంటే నమ్ము. మేష్టారు కూడ వెళ్ళువెళ్ళమని ఎంతో యిదయినారు.'

'పోనీలేరా. యింత కష్టపడి నన్ను గురించి యింత దూరం వచ్చావ్. నిన్ను చూసినదగ్గర్నుంచీ కాస్త ప్రాణాలు తేలిక అనిపిస్తోందిగాని, రోజూ నాకోసం ఎవరొస్తార్రా. తిరిగే కాలు, తిట్టే నోరు వూరుకోదని ఎప్పుడూ వీళ్ళ రూముల వెంట, వాళ్ళ రూముల వెంట దీనికని, దానికని తిరిగేవాణ్ణి. యిప్పుడిలా రూములో పడి కూర్చోవాలంటే ఏమిటో

యిదిగా వుంటుంది. అయిపోయిందిరా, ఇక నేను ప్రపంచంలో ఒంటరివాణ్ణయిపోయాను. ఈ వార్త తెలిసిన ఈ క్రొత్తలో మనవాళ్ళు "అయ్యో" అనుకుంటారేగాని తరువాత నన్ను గురించి ఆలోచించేవా డెవ్వడురా.'

'ఇదిగో రామం. ఎందుకు అంతగా బాధపడిపోతావ్. చూడు, నీ కాలు విరిగిపోయినంత మాత్రాన నీవిక ప్రపంచంలో ఒంటరిగాడి వయిపోయినట్లేనా. నీవు ఆటగాడిగా దేశంలో పేరుపొంది గౌరవం సంపాదించుకొన్నావనుకో. అది నిజమేగాని వ్యక్తిగా రామునివిగా నిన్ను గౌరవంతో కాక ప్రేమతో చూసేవాళ్ళుకూడ లేకపోలేదు. ఎందుకురా నీ చుట్టూ నీవే గోడలు కట్టుకోవటానికి ప్రయత్నిస్తావ్. అయినా చూడు, కాలు పోయినంతమాత్రాన నీవు మళ్ళీ కాలేజి కొచ్చి చదువకూడదని ఏమీ లేదుగా. నీవు కేవలం శరీరాన్నే పెంచుకొన్న విజ్ఞాన విహీనుడవు కాదుగా. హాయిగా కాలేజీ కొచ్చి చదువుకోవచ్చు. తెలివితేట లున్నాయి. ఓపికగా చదవగలవు'

'కాని ఒకే చదువును అంటిపెట్టుకొని నాలుగు గోడల మధ్య కూర్చునేవాడిని కాదురా."

"కాని ఏం చేస్తాం. కాలం అలాంటిది ఇప్పుడు నీ శక్తిని పూర్తిగా చదువుమీదకు మళ్ళించు. ఒక్క ప్యాసవటమే గాదు. డాక్టరేటును సంపాదించ గలవు. ఆ నమ్మకం నాకుంది'

'ఏమో మళ్ళీ జీవితానికి కొత్త ఆశ చూపుతున్నావు. కాని ఈ కుంటికాలు లెగరేసుకుంటూ ఎలారా కాలేజీకి రావటం ?' అతను నీరసంగా నవ్వాడు.

'నిజమేరా! నీవా మాట అంటుంటే నాకే ఎందుకో బాధగా వుంది. నీవలా టక్ చేసుకొని సింపుల్‌గా నడచి వస్తుంటే మాకే యెంతో ముచ్చటగా వుండేది. 'హీరో యిల్ పర్సనాలిటీ'' అని "డ్రెమెటిక్ పర్సనాలిటీ'' అని అనుకుంటూవుండేవాళ్ళం. నిజమేమరి, నీకెంత బాధగావుందో పాపం''

'పోనీలేరా! నా అందం పోయిందని ఏడవటం లేదు గాని, కాలేజీలో ఫీజులకు, పుస్తకాలకు, భోజనానికి, లాడ్జింగులకే కాక యింకా మరికొంత యిప్పుడు రిక్షాలకు తగల బెట్టాలే. యిదంతా పెట్టి నేనిప్పుడు యింకా ఏం చదివేదిరా! కుటుంబం పరిస్థితి అలావుందయ్యే !'

'కట్టుకుబోయినంతమందిమి మేమున్నాం గదరా ! అవన్నీ మేము చూసుకుంటాం లేరా. కాని నీకెందుకు నీవు చదివే ప్రయత్నంలో వుండు.'

♦ ♦ ♦

'ఏంరా రామూ ! ఏమిటోయ్ కుర్చీలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్, పాపం కాలు పూర్తిగా నయమై నట్లేనా ?'

'ఫర్వాలేదులే ఏదో మొండిఘటాన్ని.'

'రామం, ఇలాంటి పరిస్థితుల్లోనే మనం సమయానుకూలంగా సరిజేసుకోవాల్సి వచ్చేది. నీ జీవిత సమస్యలన్నీ

కొంతకాకపోతే కొంతవరకయినా ఎరుగున్నానని అనుకుం టాను. అందులోను ప్రస్తుత పరిస్థితుల్లో నేను నీకు నా సాను భూతిని ప్రకటించటమే కాకుండా కొన్ని సమస్యల నయినా పరిష్కారము చెయ్యగలనన్న ఆశతోనే వచ్చాను. ఆ విష యాలను గురించి మాట్లాడితే నీకు కష్టంవుండదనుకుంటే, వినే అవకాశం నీవు యిస్తానంటే మాట్లాడతాను. మాట్లాడేచనువు నాకున్నా. నీకన్నా పెద్దవాణ్ణయినా వ్యక్తిత్వం ఏర్పడ్డవాడి వేగాని చిన్న వాడివికాదు నువ్వు. అభిరుచులు, ఆశయాలు నీకూవున్నాయి. ఈ ప్రసంగం నీకు సహాయకారిగా వుంటుం దనే ఆశతోనే నేను రెండు మూడు మాటలు మాట్లాడాలను కుంటున్నాను.

'ఏమిటిబావా అంత ఉపోద్ఘాతం! ఆ చెప్పేదేదో తిన్నగానే చెప్పరాదూ!'

'తిన్నగానే చెప్పగలనుగాని తీరా నువ్వు నన్ను పొర పాటుగా అర్థంచేసుకుంటే అసలే విసుగ్గావున్న నీవు మరీ విసి గించా ననుకుంటావేమోనని దడుస్తున్నాను. ఇంతా నేను చెప్పాలనుకుంటున్న విషయం మన సరసను గురించి. పాపం ఆ గొడవల్లో దాన్ని పట్టించుకున్న వారెవరూ లేకపోయారు. నిన్న నేనొచ్చి 'ఏమమ్మా' అనటంతోనే పాపం 'బావురు' మందిరా! నాకే మనస్సు చివుక్కు మంది.'

'మళ్ళీ ఆవిషయాలెందుకు బావా! నీవింతా చేసి చివరకు ఆ పాతగ్రామఫోను రికార్డును మళ్ళీ పెడతా నంటావ్ అంతేనా ?'

'అదిగో రామం! అందుకే ముందుగా నీతో అంతగా చెప్పింది. మళ్ళీ మధ్యలోనే నీవు కడుపులో విషయాన్ని చెప్పే అవకాశం యివ్వకపోతే ఎలా?'

'ఎందుకు బావా ఇంకా ఈ దౌర్భాగ్యపు జీవితానికి అందని ఆలోచనలు. అయిపోయిందేదో ఐపోయింది. అప్పుడు కావాలని ప్రయత్నం చేయటంలో ప్రాకులాటలో అర్థవుంది. ఇప్పుడలాటివాటిని గురించి వూహకూడ చేయటానికి వీలు లేదు. నా దురదృష్టం.'

'రామం! అక్కడే నీవు పొరపడేది. ఎందుకురా నీచుట్టూ నీవేచికాకులు అల్లుకుంటావు. అందరూ అదేవిధంగా నీ వనుకునేటట్లు ఆలోచించటం లేదు. నీ కాలు పోయినంత మాత్రాన మీ అమ్మా నాన్నా నిన్ను ప్రేమించరూ?'

'ఎందుకు ప్రేమించరు, తప్పేదేముంది? కొడుకుని కాక పోనుగా. విధిలేక ప్రేమగానే చూస్తారు.'

'పిచ్చివాడివి లాగున్నావ్, విధిలేక కాదు ప్రేమించే వాళ్ళు ప్రేమించాలనే యిష్టంతోనే ప్రేమిస్తారు. నిన్ను ప్రేమించేది నీ అందంకోసమే కాదు; తప్పక ప్రేమించటమూ కాదు. నీ స్నేహంకోసం సౌహార్దంకోసం హృదయంకోసం ప్రేమకోసం ప్రేమిస్తారు. నీ కాలు పోయినంత మాత్రాన నిన్ను ప్రేమించటం మానేసే సంకుచిత స్వభావులు కాక ప్రేమకోసం ప్రేమించేవాళ్ళు వున్నారు. అందులో ముఖ్యు లెవరో నేను వేరుగా చెప్పనక్కరలేదు. కాని, నీ మనస్సులో ఎవరు నిన్ను ప్రేమించలేక పోతారని బాధపడిపోతున్నావో

ఆ వ్యక్తి నిన్నెప్పుడూ ప్రేమిస్తుంది. అదే అర్థం చేసుకొని వ్యవహారాల్ని చక్కదిద్దుకో. మీనాన్న వాళ్ళను ఒప్పించి సరళను తప్పకుండా పెళ్ళి చేసుకోటానకి సన్నాహం చెయ్యి. ఇదివరకులాగ కాక మీనాన్నను మార్చాలన్న బాధ్యత నీది. ఆడపిల్ల పాపం! అదేం చేస్తుంది. వాళ్ళ నాన్నమాత్రం ఏం చేస్తాడు? ఇప్పుడైన యిక నీవు ఉపేక్షించి చూస్తూ వూరుకో కుండా గట్టిగా ప్రయత్నించు. మనస్సులో వుంచుకొని నిన్ను గురించి ఎంత బాధపడుతుందో పాపం. 'నీదగ్గరకు ఒక్కసారి రావాలని వుంది' అన్నది. నీకు చెప్పమన్నది. మరి నీయిష్టం. నీవు రమ్మనమనే కబురంపుతావో కాదంటావో; కాని నీ ఇష్ట మొచ్చినట్లుగా వూహాగానాల్ని సాగించుకొని బాధపడుతూ వ్యవహారాల్ని పెడమార్గం పట్టిస్తే మళ్ళీ దారికి రావడం కష్టం తరువాత నీయిష్టం. నేవెళ్లొస్తా. అన్నట్లు మరచిపోయా అయినా ఎందుకులే ఇప్పుడు చెప్పటం. ఏదీ నీకాళ్ళు దగ్గరగా చూడనేలేదు. సరే, ఇక నే వెళ్ళొస్తా.'

'చిన్న తుపాను లేపి పోతున్నావు బావా.'

◆ ◆ ◆

'తలుపు తీసేవుందే! స్వామివారు దర్శన మిస్తారో యివ్వరోనని భయపడుతూ వచ్చాను'.

'రాణీవాసంవారు ముందే కబురు పెడితే గుళ్ళో దేము డైనా తలుపు తీసుకు కూర్చోవాల్సిందే. రాచరికం వారికి ఈరోజుకు అనుగ్రహం కలిగిందన్నమాట.'

'అనుగ్రహమా! ఎంతమాట బావా! నీకు తెలియంది ఏముంది మా యింట్లో. నేను వెడతానంటే అభ్యంతరం

పెట్టకపోయినా తీరా యిక్కడకొస్తే మీనాన్న వాళ్ళు ఏమైనా విసుక్కుంటారేమో. మళ్ళీ ఈకాలి బాధకుతోడు మళ్ళీ బాధపడతావు. పాత విషయాలు తలుచుకొని రాలేదు. మామయ్యకు మాపైన సదభిప్రాయం లేకపోవటం ఈనాటి విషయం కాదుగా. అది సరేగాని హాస్పిటల్‌నుంచి తిరిగి వచ్చినప్పటినుంచి నీవు ప్రొద్దుననుంచి సాయంత్రందాక తలుపులు బిడాయించుకొని కూర్చుంటున్నావుట. నే నొచ్చినా పలుకుతావో లేదోనని రాలేదు, నువ్వు నమ్ము నమ్మకపో బావా, మీ రింటికొచ్చిన నాటినుండి నిన్ను వచ్చి చూచి పోవాలని ప్రతిరోజూ ఆలోచిస్తూనే వున్నాను. అకె ఎందుకు బావా అలా కళ్ళ నీళ్ళు తెచ్చుకుంటున్నావు? ఇంత పిరికివాడవై పోయినావా బావా!'

'పిరికివాణ్ణయిపోయిన మాట నిజమే గాని, ప్రపంచం నామీద చూపిస్తున్న ప్రేమ ఆపిరికితనాన్ని పోగొట్టుతోంది. ఈ కన్నీళ్ళు పిరికితనంచేత వచ్చినవికావు. ప్రపంచం నామీద చూపుతున్న ప్రేమకు కృతజ్ఞత.'

'ఇందులో విశేషమేముంది బావా. నీ వందర్నీ ప్రేమించావు; నిన్నందరూ ప్రేమిస్తున్నారు. ఈ కాలు పోయినంత మాత్రాన నీ మనస్సులో లోపమేమైనా వుందా? అదీగాక ఒకప్పుడు మాత్రం ప్రపంచంలో నాకు సాటేమిటని నీవు ఏరోజునైనా విర్రవీగావా? నీవలా విర్రవీగితే ఈరోజున నిన్ను గురించి విర్రవీగినందుకు తగిన శాస్తి జరిగిందని అనుకునే వాళ్ళు. నీవూ అనుకోవలసివచ్చేది. కాని జరిగినది కేవలం

దైవిక విషయం, అందువల్ల నీవు మరింత ప్రేమింపబడాలే కాని తృణీకరింపబడవు. అలాంటి అవసరమూ లేదు.'

'అవును సరళా, నేనే అర్థం చేసుకోలేక చీకటి గదిలో చిక్కుకుందామని చూశాను గాని నా అవివేకాన్ని నువ్వూ, బావ, మిత్రులు, మేష్టారూ అందరూ కలసి పోగొట్టారు.'

'అందులో నీ అవివేకమేముంది. నీవు అలా అనుకోటం సహజమే అవి పరిస్థితిని బట్టి! కాని ఇప్పుడైన నీవు నీ ఉద్దేశ్యాన్ని మార్చుకున్నావు. అందుకు సంతోషమె.'

'అవును సరళా నిజం. నాకోసం కాకపోయినా ఈ ప్రపంచములో నే చేయాల్సిందేమీ లేకపోయినా నాగురించి బాధపడేవాళ్ళమాట అతిక్రమించకుండా వుండటానికయినా నేను బ్రతకాలి.'

'బావా ఎందుకు అలా అనుకుంటావ్. ప్రపంచంలోకి వచ్చిన ప్రతివాళ్ళు ఏదో చెయ్యటానికి వస్తారా. అయినా నీవు మాత్రం ఎందుకు చెయ్యలేదు. ఒకకాలు పోయిందని నీచదువు, తెలివితేటలూ అవేమీపోలేదుగా. ముఖస్తుతిఅనుకోకుండా వుంటే నీవు వ్రాసిన కథలు వ్యాసాలు నాకెంతో బాగా నచ్చుతాయి తెలుసా. ఇకనుంచి శక్తిని కూర్చుకుని కృషి చేసి చదువు. రచనా వ్యాసంగాలపైకి మళ్ళించు. ఇదివరకటినాటకాలు ఆటలు సాంఘికసేవ అవన్నీపోయి ఇప్పుడు నీజీవితపథము నిర్ణయమయిపోయింది. వెలుగు బాటలో నడకసాగించు. ఇది నీజీవితానికి దైవనిర్ణయం.'

'అవును. ఈ మార్గాన నడకసాగించటం విషయం మిత్రుడు ప్రకాశంకూడా సూచించే వెళ్ళాడు. కాని

చేయూంత లేకుండా ఆ మార్గాన నడవలేనని అనిపిస్తోంది. సరళా, కాని అర్హతలేకుండా ఆశలకోసం ప్రాకులాడటం మాత్రం తప్పనిపిస్తున్నా మాన లేకుండా వున్నాను.'

'బావా ఎందుకింత గూఢంగా మాట్లాడతావు. నీజీవితం నడవటానికి నేనే గనుక ఆసరాగావుండి చేయూత నివ్వాలని నిజంగా నీవనుకుంటూవుంటే నిజంగా నా జీవితం ఒకందుకు వినియోగ పడిందనే నేననుకుంటాను. నీ భావమే గనుక అదిఅయితే నన్ను నీవింకేమి అనుకోనక్కరలేదు. నీదాన్నిగా వుండటం నాకెంతో సంతోషకరమైన విషయం. అందుకు నీవనర్హుడవని పదేపదే బాధపడొద్దు. నాకు పూర్వం బావకంటె ఇప్పటిబావ మరింత ప్రేమపాత్రుడు.'

'సరళా......'

'అయ్యో పడిపోతావు బావా' అదేమిటి అట్లా ఒక్కసారి మంచంమీద నుండి ఎగిరి నిలబడ్డావు.'

'ఈ సంతోషంలో ఒక్కక్షణం నాపరిస్థితిని మర్చిపోయాను. అప్పుడప్పుడు యిలానే మర్చిపోతూ వుంటాను. ఇంకా నయం అమాంతం నువ్వు గట్టిగా పట్టుకోబట్టిగాని లేకపోతే క్రిందకు పడిపోయి వుండేవాణ్ని. ఆఁ ఏదీ ఆకర్ర యిలా యివ్వు. నాన్నతో నేనిప్పుడే ఈవిషయం చెప్పివస్తా. దైవనిర్ణయం ఇది దీన్ని మార్చటానికి ప్రయత్నం చెయ్యొద్దని చెబుతా. ఊళ్ళో పార్టీల పట్టుదలకోసం మనిద్దరం విడివడటానికి వీలులేదని చెబుతా. ఇన్నాళ్ళనుండి చెప్పే ధైర్యం లేకపోయింది. కాని ఇవాళ ఆవిషయం చెప్పగలను. ఆయన్ని

ఒప్పించగలను. ఊళ్ళో వ్యవహార రీత్యా మీనాన్న మానాన్న మాట్లాడుకోవచ్చును; మాట్లాడుకోక పోవచ్చును. గాని అందుకుగాను మన సంబంధాలు విడిపో నక్కరలేదని చెబుతాను.'

'మావయ్య కచేరిసావిడిలో వున్నారిప్పుడు.'

'ఫరవాలేదులే అక్కడికే వెడతాను. ఆ కర్రలుయిలా తెచ్చిపెట్టు.'

"మావయ్యకచేరీ సావడిలోంచి వచ్చిం తర్వాత చెప్పొచ్చుగాని వాటి సంగతి అలావుంచు. ఇదిగో ఈసంచిలో ఏముందో తెలుసా? నీవేమి అనుకోకుండా వుంటే ఒక్క విషయం చెప్పాలి. మాఅన్నయ్య వెళ్ళిపోతూ నీవు హాస్పిటలు నుండి వచ్చేటప్పుడు రబ్బరుకాలు వేయించుకు రాలేదని తెలిసి ఇదిగో ఇది కొని తీసుకొచ్చి యిచ్చి వెళ్ళాడు. ఇలా కూర్చో, నేనే తొడిగేస్తాదాన్ని. మరి నేవెళ్ళి రానా?

"ఏమో నీయిష్టం."

"ఏమిటిబావా ! అలా అంటావు. కాసేపు కూర్చో మంటే కూర్చోనా, నీయిష్టమనకపోతే."

"ఏమో నేనెలా చెబుతాను. కాళ్ళు రెండూ తిన్నగావున్నప్పుడే నీవుచిక్కకుండా పరుగెత్తేదానివి. ఇప్పుడిక కుంటివాణ్నయి ఎలాపట్టుకోగలను. అందులో వెళ్ళిపోతా నన్నతర్వాత ఆపగలనా ?"

"అవన్నీ దాగుడు మూతలు. అప్పుడు అలాపరుగెత్తటం

సహజం. ఇప్పుడిక దాగుడు మూతలు అయిపోయినై. ఇక అలా పరిగెత్త లేను.'

" కాదు యిప్పుడే దాగుడు మూతలు మొదలగుతున్నాయి. పద వెళదాము."

" ఏమిటే ఫోజు ! నీవిలా నాభుజంమీద చెయ్యివేసి నడుస్తూ మీనాన్న దగ్గరకు వెళితే మీనాన్న చూస్తూనే విశ్వామిత్రుడై పోతారు. ఇల్లా మీనాన్న దగ్గరకి నేను రాను. ముందు నీవు వెళ్ళి చెప్పు వీలుచూచుకొని."

" కాదు ముందు అమ్మ దగ్గరకి మాత్రమే చూపించటానికి ......"

" ఏమిటి క్రొత్తగావేసుకొన్న రబ్బరు కాలునా ?

" కాదు కొత్త కోడలవుతున్న మేనకోడల్ని."



# పండక్కి....

అయిదు గంటలయ్యే సరికి పైన పక్షులల్లే ఎగిరిపోవా లిగాని సీట్లు పట్టుకొని వెళ్లాడకూడదనే సిద్ధాంతాన్ని సర్వదా అమలులో పెట్టే నామిత్రులు ఆరోజు 'పే' రోజు కావటవల్ల (మనలో మాట) పది నిముషాలు ముందుగానే ఆఫీసునుంచి బయలుదేరారు హుషారుగా ! తిన్నగా మారథం మోడరన్ కేఫ్ ముందు ఆగింది.

"వెధవది. ఇవాళే నాస్వీటు తినక పోతే ఎలా" అన్నాడు జగన్నాథం కొంచెం హుషారుగా బేరర్ ఏంకా కావాలి అడుగుతూ వుంటే.

"నీ కెప్పుడూ స్వీటు, హాటు - తిండి తప్ప మరోటి కనుపించదు. పోనీ ఇవాళ డబ్బులున్నాయనైనా బిల్లుయిస్తావు గనుకనా" అన్నాడు సూరి. బిల్లు అంటే నలుగురిది కలిసింది అని అర్థంసుమా అండి !

"తొందరగా తెముల్చుకుంటే కాస్తంత షాపింగు వుంది నాకు" అన్నాడు శాస్త్రి.

'నీకేమిటి, నాకుమాత్రం లేదు షాపింగు. పండగ బట్టలు కుట్టించాలి. తీరా పండుగముందు కొంటే ఆ టెయి లర్ కు ఇవ్వటం పనేగాని బట్టలు పుచ్చుకొనే పనుండదు.'

"ఏం మీమామగారు పండుగ సొమ్ములు ముందే అందచేశారేమిటి"? అన్నాడు సూరి.

'డ్రూ ప్రాపర్ ఛానల్ అదే వస్తుంది. ముందుమనం కుట్టించుకుంటే సరి ! రేపో మాపో కబుర్లు, దాంతోపాటు మా శ్రీమతి నాలుగు రోజులు ముందుగా వెళ్తుంది గనుక మనం ముందే కుట్టించుకొని వుంచుకున్నాం అని తెలిస్తే పండుగనాడు పోకెట్లో క్యాషు మిగుల్తుంది' అన్నాడు జగన్నాథం.

డ్రింకు త్రాగుతుండగా 'ఏమాత్రం ఖర్చు పెడుతు న్నావ్ ఇవాళ బట్టలమీద ' అడిగాడు సూరి జగన్నాథాన్ని.

' అథమం మా మామగారు నలభైకి తక్కువ లేకుండా ఇవ్వొచ్చు. టైలరింగు చార్జీలుకూడ కలుపుకొని అదిసరిపో యేటట్లు చూస్తాను ' అన్నాడు జగన్నాథం.

బేరర్ బిల్లుపట్టుకొచ్చి ఎవ్వరికివ్వాల నట్లు క్వొశ్చెన్ మార్కు మొగంవేసి నిలబడ్డాడు.

అందరి జేబుల్లో డబ్బులు నిండుగావున్నా ' అదనపు రాబడి అథమం నలభై అయినా అంచనా వేస్తున్నప్పుడు ఇవ్వాళ బిల్లు జగన్నాథం ఇచ్చేశాడు' అన్నాడు సూరి.

" అన్నా, స్వీటు హాటు, కూల్ డ్రింకు- అంతా కలిపి మూడున్నర బిల్లుచేసి ఇవాళ నాకా డెబిటు" అన్నాడు జగన్నాథం.

" ఫరవాలేదులేవోయ్, భయపడకు. ఈ ' డెబిట్ ' కూడ చూడు- ఆ హెడ్డుకిందే వేసెయ్ 'అన్నాడు సూరి.

శాస్త్రి నవ్వి ఊరుకున్నాడు.

లక్ష్మీ జనరల్ స్టోర్సు రెండో అంతస్తులో చేరి ముందు మామూలు బిన్నీ కంపెనీతో ప్రారంభమయిన సెలెక్షను నలుగురి ధాటికి ఆగలేక వులెన్ వరకూ పోయింది.

జగన్నాథానికి ఆల్‌వులన్ ప్యాంటు, తెల్లచొక్కా సెలెక్టు అయినై.

అనుకోకుండా సూరి షార్క్‌స్కిన్ ప్యాంటు, కలర్ బుష్‌జాకెట్టు తీశాడు.

శాస్త్రి హనావా ప్యాంటు మీదకు డెకోరన్ శ్లాక్ తీశాడు.

నావంక చూసిన మిత్రులకి నేను మొదటే మనకి బడ్జెటులో 'ప్రొవిజన్' లేదని చెప్పేశానుగాని అందరూ ప్యాకెట్లు చేతిలో పట్టుకొని పోతూవుంటే ప్రాణం రెపరెపలాట్టం మొదలెట్టింది. అయినా కోరికలు చంపుకోవాలి అనే బుద్ధుడి మాటలు జ్ఞాపకం తెచ్చుకొని మననం చేసుకుంటూ టెయిలర్ షాపుకి బయలు దేరాం.

మిత్రులు ముగ్గురూ కొలతలిస్తూవుంటే కూర్చుండి ఏమీతోచక 'షో' కేసులవంక చూస్తూవుంటే కుట్టిన ఒక జర్కిన్ కనిపించిది.

"శాస్త్రీ! ఈక్లాత్ నాకైతే ఎలా వుంటుంది" అన్నాను.

"బాగనే వుంటుందిగాని ఇది జెర్కిన్. కుట్టించుకుంటే రోజూ ఆఫీసుకి వేసుకొని రావటానికి పనికి వస్తుందా పాపా" అన్నాడాయన.

"అయితే అయిందిలే రంగునచ్చే టట్లయితే ఏం ఆఫీసుకు మాత్రం. వేసుకు రావటానికేం" అన్నాను.

"చిన్నపిల్లవాడిలాగ ఆఫీసుకు జర్కిన్ వేసుకువస్తావా"

"కాకపోతే అప్పుడప్పుడూ వేస్తాను. ఏం పోయింది" అన్నాను.

"మరి బడ్జెట్టులో ప్రొవిజన్ సంగతీ" అన్నాడాయన,

"వేశాంగా పథకం" అన్నాను.

"సరయితేఅవశ్యం కానీయటమే, ఆక్షేపణేముంది" అన్నాడాయన. టెయిలరు దగ్గరే వుండట ఆరకం గుడ్డ. జెర్కినుకు సరిపోను గుడ్డ ఇరవై రూపాయలవుతుంది. కుట్టు కూలి పది రూపాయలు. ముప్ఫై ముందేఇచ్చేసి బిల్లుపుచ్చుకొని బయలుదేరాను.

దారిలో శాస్త్రి "ఏమిటి ఒక్కసారే ప్లేటు మార్చేశావ్" అన్నాడు

"అదేమిటి శాస్త్రి అలా అంటావు! మనకి జగన్నాథం ఆదర్శం" అన్నాను నాపథకాన్ని అందిస్తూ.

"చెప్పవేంమరి ఇందాకణ్ణుంచి అన్నాడు" శాస్త్రి.

♦ ♦ ♦

పండుగ నాలుగు రోజులుండనగానే శ్రీమతి బయలుదేరింది. వెళ్ళేటప్పుడు మళ్ళీ మీరొచ్చేటప్పుడు వేరే ఒక సంచి ఎందుకని మీాలికూడ ఒక జత బట్టలు వేసు కెళుతున్నానని చెప్పింది.

శ్రీమతితో ఈ విషయం చెబుదామా అనిపించింది. కాని భా పరువునష్టం అనిపించింది. అదీగాక చివరికి వెళుతూ

వెళుతూ శ్రీమతిని తీసుకెళ్ళటాని కొచ్చిన బావమరది 'ఇదిగో నీవు వచ్చేటప్పుడు నీకు నచ్చిన కలర్సులో ఒక ప్యాంటు, షర్టు కుట్టించుకొని తీసుకురమ్మని నాన్న డబ్బుయిచ్చి పంపారని అనటమో, మనియార్డరు పంపించి కుట్టించుకొని రావలసిందని వ్రాయటమో చేస్తారు. అదీకాకపోతే అక్కడికి వెళ్ళిన తరువాత బజారువెళ్ళి షాపులో గుడ్డలు సెలెక్టు చేసుకొని అటే టైలరుకిచ్చి వద్దామని నన్ను తీసుకెళ్తారు. ఒకవేళ నన్ను బజారు తీసుకెళ్ళటం బాగుండదనుకున్నా, కొనడానికి వెళ్ళేటప్పుడు కొలతలైనా తప్పని సరిగా నన్నడిగి తీరాలి. కొలతలు తీసుకొని తీరాలిగదా. కాబట్టి నాకు తెలియకుండా ఏం చేస్తారులే అనుకొని చెప్పకుండా ఊరుకున్నాను.

మూడు రోజులు గడిచింది. వెళ్తూ మా బావమరది డబ్బు యివ్వలేదు సరిగదా మనియార్డరూ రాలేదు బహుశా పెట్టెనిండుగా వున్న గుడ్డల్ని చూసి నాకు డబ్బే యివ్వమని మా శ్రీమతి సలహా యిచ్చివుంటుంది. భేష్, బాగానేవుంది అనుకొన్నాను.

రేపు పండుగనగా ప్రయాణమవుతూ వెళ్ళి జర్కిన్స్ తీసుకొచ్చాను టెయిలరు దగ్గర్నుంచి. మిత్రులందరూ నా దగ్గర వున్న 'షా' ఏదీ దానికి 'మేచ్' కాలేదని నాలుగు రూపాయలుపెట్టి కొత్త షా ఒకటి కొనిపించారు.

ముసలాడికి పెళ్ళామంటేను (రెండో పెళ్ళాంలెండి) పిల్లవాళ్ళకు బట్టలంటేను చాల ఆనందమంటారు. కొత్త జెర్కిన్స్

జిప్ బేగ్‌లో వేసుకొని హుషారుగా మామ గారింటికి చేరాను. రాత్రంతా కూడా పండుగ బట్టల ప్రస్తావనే లేదు.

బహుశా ఉదయం ఏ రెడీమేడ్ డ్రెస్సు షాపుకో బయలు దేరమంటారు. అప్పుడు వద్దులెండి అని సంగతి చెప్పేసి పైకంపుచ్చుకో వచ్చు అనుకున్నాను.

ఉదయం లేచి కాఫీ ముగించుకొని బజారుకి వెళ్ళటా నికి సిద్ధమయ్యాను. ఉహుఁ! అందుకెవ్వరూ సిద్ధంగా లేరు. తలంటికి మాత్రం లేవ మన్నారు. తలంటి పోసుకొని లోప లికి వచ్చాను. వస్తూనే మా శ్రీమతిని కేకేశాను.

"ఏమండీ" అంది వచ్చి.

"చూడు! పెట్టె తెరచి నా బట్టలు తీసి ఇవ్వు" అన్నాను.

"అదేమిటండీ! పండుగపూట పెట్టె తెరచి పాతబట్టలు తీసి ఇవ్వమంటారేమిటి. ఒక్క నిముష మాగండి. అన్నయ్య బజారుకి వెళ్లాడు. బట్టలొస్తాయి" అంటోంది.

"వచ్చేశానమ్మా! ఇవిగో బట్టలు" అన్నాడుప్యాకెట్టు అందిస్తూ మాబావ మరది.

"అయ్యో అదేమిటి, నన్నడక్కుండా బట్టలు ఎలా కొన్నారు నాకు" అన్నాను.

"అదేమిటండీ, అలా అంటారు. మంచి వాళ్ళేమీరు. పండక్కి అల్లుడికి బట్టలు కొనేటప్పుడు 'నాయనా, అల్లుడూ, పండుగకి నీకు బట్టలు కొనమా' అని అడుగు తారేం?" అంది నవ్వుకుంటూ మా శ్రీమతి.

"అదికాదు వనజం! కొలతలెలా సరిపోతాయి. ఒక్క ముక్క నాకు ముందు చెబితే నేనే బజారుకు వెళ్ళి నాకొలతలు యిచ్చేవాణ్ణిగా!"

"బాగుందండీ! మీకు బట్టలు కుట్టిస్తాను రమ్మని మిమ్మల్ని బజారుకు తీసికెళ్తారా ఏమిటి నాన్న!"

"మరయితే ఏవో సైజువి తొడుక్కోనా" అన్నాను ఏం అనలేక! అసలు, నా బాధ వేరే వున్నదయ్యే!

"కుట్టించే వాళ్ళు పిచ్చివాళ్ళటండీ. పెట్టిలోవున్న మీ ప్యాంటూ, చొక్కా ఆదినే అవి కుట్టించారు" అంది.

నేను తెల్లబోయాను.

నేను వేసిన ప్లానంతా చెడిపోయిందయ్యే. కాని ఇలా చేద్దామనే వుద్దేశ్యంతో ముందే కొనుక్కున్నానని వాళ్లతో చెప్పేసి నట్లుంటే; కనీసం శ్రీమతి ద్వారా చెప్పించినట్లుంటే. కాని ఎలా? నోరు విప్పి చెప్పటమా! అలా అని మనస్సు అయిన దానికి సంతృప్తిపడి ఊరుకోదయ్యే!

"ఆ రంగు వగైరాలుకూడ నన్నడిగితే నేను చెప్పేవాణ్ణిగా! అదీగాక ఆ ప్యాంటు 'లోహీల్ టక్'ది. అది సూటువేసుకునేందుకేం పనికి వస్తుంది. ఆ చొక్కా ఇదివర కుది ఇప్పుడంత పొడుగు ఎవరూ పెట్టించటంలా" అన్నాను ఘూసుకుండలేక

"ముందు తొడుక్కోండి, తర్వాత చూద్దాం ఆవిషయాలు" అంది వనజం ప్యాంటు, చొక్కా తీసి చేతికిస్తూ.

ఒక్కొక్కటి శరీరం మీద కెక్కించాను. కాని ఏదో పైన దెబ్బకు కట్టుకట్టినట్లు ఫీలయ్యాను.

సరే, అయిపోయిందేదో అయిపోయింది. కుట్టించుకున్నవి ఎలాగు తొడుక్కోవాలి గనుక కిట్‌బేగ్‌తీసి జర్కిన్ కొత్త 'బా' బయట పడేశాను.

బీరువాలోనుంచి "టై" తీసుకు రావటానికి వెళ్ళి తిరిగొచ్చిన వనజం "అరె, చెప్పలేదేమండీ, ఇదెప్పుడు కుట్టించారు" అంది.

నిజం చెప్పొద్దూ! అసలే మనస్సులో తనేస్వయముగా ఆదికి పెట్టెలోనుండి బట్టలు తీసి యిచ్చింది కనుక దీనికంతా బాధ్యురాలు మా శ్రీమతేనని బాధపడుతున్న నేను 'ఎప్పుడో అప్పుడు కుట్టించావులే నీవు చేసిన పనులన్నీ నాకు చెప్పాలా ఏమిటి' అన్నాను ఈసడింపుగా.

"ఏమిటండీ అల్లా అంటారు. నేనేం చేశాను మీకు తెలియకుండా. అయినా చూడండి మీ ప్యాంటు, చొక్కా ఎంత బాగున్నాయో. వైట్‌షర్టు - రాయల్ వైటయ్యే - ఇక పొడుగంటారా? ఇన్‌షర్టు వేసేవాళ్ళకి కాస్త పొడుగు ఎక్కువయితేనేం లోపలపడి వుండేదేగా. ప్యాంటు మీరు కోరుకున్నట్లుగానే 'థిక్కు కలరు' ఇంకా ఎందుకు బాధ" అంది జర్కిన్ వెనుకనుంచి చేతులకందిస్తూ. "చూడండి, ప్యాంటు చొక్కా వాళ్ళవి జెర్కిన్, 'బా' మీవి. ఎంత బావున్నాయో చూసుకోండి అద్దంలో"

"అద్దంలో కాదు వనజం చూసుకోవలసింది. రేపొద్దున ఇంటికెళ్ళి టేబుల్ సొరుగులో" అన్నాను; ఇహ శ్రీమతి కైనా విషయం చెబితేనేగాని మనస్సు కాస్తంత స్థిమిత పడదని.

"ఏమిటండీ" అంది.

"ఇంకా ఇంటిఅద్దె యివ్వలేదు. వనజం?"

"ఇప్పుడా సంగతి ఎందుకండీ. ఇవ్వకపోతే తర్వాత యిద్దురుగాని. పండుగపూట లోటుబడ్డట్టు వల్లిస్తారేం, హాయిగా డ్రెస్ చేసుకొని అల్లాతిరిగిరాక. మరి అట్లాఅను కునే వాళ్ళు యిదిఎందుకు కుట్టించుకున్నారు" అంది.

వేసిన పథకం చెప్పేశా, ఎవ్వరూ వినకుండా జాగ్రత్తపడి.

అంతా విని "మామూలులాగ కాక, ఈసారి మీకు నచ్చేటట్లుగా బట్టలు కుట్టించి, మీరు తలంటి పోసుకుని రూములోకి వచ్చేసరికి తెప్పించి వుంచి మీకు ఆశ్చర్యం కలిగించాలనుకున్నాం. మరి మీరు నాతోనైనా చెప్ప లేదేం!" అంది నేరం నాదేనన్నట్లు.

అభిమానం అడ్డొచ్చింది–అని చెప్పటం ఎలా? కిక్కురు మనకుండా ఘూరుకున్నాను.

"మూడు నెలలు మూడు పదులు తీరుద్దురుగాని, ముందు చక్కగా వున్నాయి బట్టలు, అద్దంలో చూసుకోండి" అంది.

"బాగున్నాయ్ అని నువ్వన్న తర్వాత ఇంకా అద్దంలో ఎందుకు. సరే నీమాట ఎందుకు కాదనాలిలే" అన్నాను వనజాన్ని దగ్గరకు తీసికొంటూ.

"అదేమిటి అద్దంలో చూసుకోమంటే నా మొఖంలో చూస్తా" రంది తప్పించుకోవటానికి ప్రయత్నిస్తు.

"అద్దంలో అయితే ఒకవేళ బాగుండకపోతే బాగుండ నట్లు కన్పించవచ్చు. కాని ఈ కనుపాపల్లోమాత్రం నేను ఎప్పుడూ బాగునట్లే కనుపిస్తాను. అందుకని" అన్నాను.

—o0o—

6)

# అడవి పగడాలు

విరహోత్కంఠతతో ఎదురుచూచిన ప్రియురాలులాగ ఎదురుచూసి వాల్తేరు ప్యాసింజరు రాగానే వెళ్ళి కూలబడ్డాను మూలనున్న ఒక సీటు చూచుకొని తెనాలి స్టేషనులో. అప్పటికి అది మూడుగంటలు లేటు అయినా "కనెక్షన్ లేషన్" ఏమిటంటే రైలు అంతా ఖాళీగా వుంది. హాయిగా ప్రయాణం చెయ్యొచ్చు అనేటట్లుగా రైల్వేవారి లెఖ్ఖ ప్రకారం బెంచీలమీద వేసిన నంబర్లుకూడా పూడినట్లు లేరు జనం. అలా ఆధునికయుగంలో రైళ్ళను అప్పుడప్పుడూ అలా చూడటం తాజమహలును (చూడటానికికూడ పన్ను వెయ్యాలనుకుంటున్న ఈ రోజుల్లో మాట్లనుకునేను) చూసినంత ఆహ్లాదం కలిగిస్తుంది.

రైలు మెల్లిగా ఉచితరీతిని నడక సాగించి దగ్గిరాల చేరింది. పెట్టిలోకి మూటనొకటి ఒక చేత్తో పట్టుకొని మరో చేత్తో చంటిదాన్నొకదాన్ని నడిపించుకుంటూ ఒక మనిషి లోపలికొచ్చాడు. ఆ వెనుకనొక ముసల్ది ఒక చిన్న గుడ్డమూట నందించి తనూ లోపలికొచ్చింది. వచ్చిందే తడవుగా నాకెదురుగావున్న బెంచీమీద కూర్చోబోయారు. కాని కాళ్ళు చాపుకొని 'రాయబారం' నాటకంలో మొదటి సీనులో కృష్ణుడి పోజులో పడుకున్న నాతోటి ప్రయాణీకుడొకాయన గదమాయించేశాడు కూర్చోవటానికి వీల్లేదని, ఇంకా కాళ్లు బాగా చాపుకొంటూ.

వాళ్ళు క్రింద కూచోబడ్డారు రెండు బెంచీలకు మధ్య నున్న ఖాళీలో. పిల్లది అతనికి దూరంగా కొంచెంసేపు ఇటూ అటూ కూచుని ఆ తరువాత అతని ఒళ్ళో పడుకొని కాసేపట్లో నిద్రపోయింది.

"ఎవర్రా మీరు, నక్కలవాళ్ళా" అన్నాడు ఎదుటి బెంచీమీద పడుకొన్న నామిత్రుడు (ప్రయాణంలోనే లెండి !)

"పాములవాళ్ళు కామోసు" అన్నాను నేను అప యత్నంగా. చిరిగిపోయిన చొక్కా, పచ్చని పుట్టగోచీ, కాలికి తెల్లని వెండి కడియం, చేతులకు తెల్లగా మెరిసే మురుగులు, [illegible]గా, పాగాలోనుంచి బయటికి కనిపిస్తున్న పెద్ద జుట్టు ముడి, చెవితమ్మలకు ఎర్రని కమ్మలూ-వున్న అతన్ని చూసి.

"పాములవాళ్ళం కాదు బాబు, బొందిలీలం" అన్నాడు అతను సవినయంగా !

"నక్కలవాళ్ళు అంటారు కదరా మిమ్మల్ని" అన్నాడు మళ్ళీ నామిత్రుడు.

"నక్కల్ని తింటామని అట్లాఅంటారు బాబు, అసలు బొందిలీలమే" అన్నాడు.

"ఏం చేస్తూ వుంటావు" అన్నాను.

"పూసలు, పిన్నీసులు, దబ్బలాలు, సూదులు, పిన్నులు అమ్ముతాం బాబూ" అన్నాడు.

"[illegible]త్త దొంగ ముండాకొడుకులండీ, ఏలుగావుంటే

ఇళ్ళల్లో పాత గుడ్డలు, చెంబు తప్పేలా - ఏది దొరికితే అది ఎత్తుకుపోతారు" అన్నాడు నామిత్రుడు.

అతనేం మాట్లాడలేదు. వాలకం చూస్తే మనిషిలో ఏభావమూ కనిపించదుగాని, మనిషి మాత్రం దృఢకాయుడు. ఆ బలిష్టమైన శరీరమే కొంత అందాన్ని ఇచ్చింది అతనికి. ఆపిల్ల అతని ఒళ్ళో అలాగే పడుకొని నిద్రపోతోంది. ఒక చిన్న 'లంగా' తప్ప శరీరానికి పైన ఏమీలేదు. చూస్తే దిష్టి తగిలేటంత బలిష్టంగా వుందిపిల్ల శరీరం. మెళ్ళోఒక్కటే ఒక్కటి పగడాల దండ-ఎందుకో చాల అందంగా వుంది అనిపించింది దండ.

వల్లపూడి స్టేషను ఎప్పుడు దాటిపోయిందో గమనించ నేలేదు. కొలనుకొండ వచ్చింది కూడ. ప్రయాణం చేస్తున్న మిత్రుడు కిటికీలోంచి తొంగి చూచి "ఏళ్ళ పని పడతా నుండండి" అంటూ టిక్కెట్టు కలెక్టర్ని లోపలికి చేయియూపి పిలిచి ఆయన లోనికి రాగానే వీళ్ళని చూపించాడు.

కాని మరుక్షణంలో నా మిత్రుడికి ముఖం తెల్లబడి పోయింది. అతను చింకి తలపాగా విప్పి టిక్కెట్లు రెండు తీసి ఇచ్చాడు టిక్కెట్టు కలెక్టరుకి.

"అరి తొత్తుకొడకా" అన్నాడు నా మిత్రుడు.

టిక్కెట్టు కలెక్టరు వెళ్ళి పోయాడు.

ఆ పిల్ల మెళ్ళో వున్న పగడాలదండ చూసి చూసి నాకు మా పాప కలాటి దొకటి వుంటే బాగుంటుందని పించింది. అనిపించిందే తడవుగా వాళ్ళు పూసలు అమ్ముతారు

గనుక "మీ అమ్మాయి మెళ్ళో వున్నదే; అలాంటి దండ లున్నాయా" అనడిగాను.

"లేవు బాబు, అయిపోయినై. సూదులు, పిన్నీసులు తప్ప అవేవీ లేవు" అన్నాడతడు.

"అవి అడవి చెట్టు పగడాలు బాబూ! అది వుంటే అడవిలోకి వెళ్ళి చెట్టు పగడాలు, పూసలు పట్టుకొచ్చేది. ఈడికేమో అంత నిస్సత్తువ, నీరసం. పనీసెయ్యాడు, పాటూ సెయ్యాడు. పొట్ట నిండించుకోటం కూడ సరిగా తెల్వాదు బాబు" అంది ముసల్ది తలవంచుకొని కూచున్న కొడుకు వంక చూస్తూ.

"నీకు పెళ్ళాము లేదేరా" అన్నాడు నా మిత్రుడు.

"లేదు బాబూ సచ్చిపోయింది."

ముసిల్దికూడ వెంటనే అందుకుని "సచ్చిపోయింది. పూసలాంటి మనిషి. అది వున్నన్నాళ్ళు ఆడికీ నాకుకూడ దిగులులేదు. ఇప్పుడు ముగ్గుర్ని దిక్కులేనివాళ్ళని చేసిపోయింది. ఆబిడ్డకింకా మూడేళ్ళు నిండలేదు. ఈడుఅట్టా ఎనక నుంచుంటే ముందు అదే పనంతా సేసుకు పోయి సంపాయించుకొచ్చి పెట్టేది. ఈణ్ని నన్ను ఇంటి దగ్గరపెట్టి అడుక్కొచ్చి పెట్టేది. ఇప్పుడైనా ఒల్లు వంచి పనిసేసి కాతంత కూడబెట్టి మారు మనువు సేసుకోరా అంటే సేసుకోడు." అంది. ఏదో బాధ ముఖంలో సుడులు తిరుగుతున్నట్లు పైకి తెలుస్తూనే వుంది.

"ఏరా చేసుకోరాదట్రా" అన్నాడు నా మిత్రుడు.

అతను మాట్లాడ లేదు. మళ్ళీ అదే అడిగాడు నా మిత్రుడు, వదలి పెట్టకుండా!

"నేనుకో బుద్దెయ్యాదు బాబూ మారుమనువు" అన్నాడు. పైకి నిబ్బరంగా చెప్పినా ఆమాట అంతరాంతరా లలోంచి పెల్లిగిలి పైకిదూసుకొని వచ్చినట్లుగా వుంది.

"ఏడిశావ్ లే" అన్నాడు నా మిత్రుడు.

అతను ముఖం దించేసుకున్నాడు గాని ఓషది క్షణాల పాటు ఏదో విపరీతమైనమార్పులొచ్చి మాయమైనై అతని ముఖంలో. ఎందుకో నా మిత్రుడు ఏసంభాషణా ఉపక్రమించ కుండా ఘ్రూరుకున్నాడు. రైలు బ్రిడ్జి దాటి. విజయవాడ చేసు తోంది. నా ప్రయాణం విజయవాడ వరకే.

నా మనస్సు మాత్రం పగడాల దండమీదవుంది. ఇక వుండబట్టలేక "ఆ పగడాల దండ అమ్ముతావా" అన్నాను ఒళ్ళోవున్న పిల్ల మెళ్ళోదండ చూపించి.

"లేదు బాబూ అమ్మను బిడ్డ మెళ్ళోది అది దాన్ని అమ్మను" అన్నాడు.

"మామూలుగా దాని ఖరీదు ఎంత వుంటుందేమిటి?"

"అర్ధరూపాయి బాబూ"

"అయితే ముప్పావులా ఇస్తాను పోనీ"

"వద్దు దొరగారూ, బిడ్డ మెళ్ళో దాన్ని అడక్కండి" అన్నాడు. కొంచెం నిష్కర్షగాను, కొంచెం బాధ రెండూ మేళవించి నట్లున్నాయ్ ఆ మాటలు.

బెజవాడ స్టేషను వచ్చింది. రైలు దిగి ప్లాటుఫారం

మీద నడక సాగించాను పోనీ రూపాయి ఇస్తానంటే ఇచ్చే వాడేమో పగడాలదండ పాప మెళ్ళో ఎంతో బాగుండేది అనుకున్నాను. ఆ తరువాత ఆముసిల్ది కోడల్ని గురించి చెప్పిన విషయాలు, అతను సేసుకో బుద్దెయ్యాదు బాబూ సూరుసునువు అన్న మాటలు జ్ఞాపకం వచ్చినై. 'మనిసి' అనుకున్నాను మనస్సులో. అనుకుంటూ హిగిన్ బాథమ్స్ వరకు వెళ్ళి కొత్త పత్రిక లేమన్నా వచ్చినయ్యేమోనని కలయజూసి తిరిగొచ్చాను. గేటు దగ్గరకొచ్చి టిక్కెట్టు ఇచ్చి బయటి కొస్తున్నాను.

"బాబూ"

వెనుకనుంచి వినిపించి తిరిగి చూశాను. అతనే.

"ఏమిటి" అన్నాను.

"ఆ దండ ఇస్తాను అర్ధరూపాయి యిప్పించండి."

"ఏం ?"

"పిల్లదానికి టిక్కెట్టు లేదని పట్టుకున్నారు. తల్లిలేని పిల్ల పెద్దదాని క్రిందే లెఖ్ఖంట. దానికసలు తల్లి లేనేలేదు. అని చెప్పినా, దానికి మూడేళ్ళుకూడా లేవన్నా ఆళ్ళు నమ్మటం లేదు" అన్నాడు.

"పిల్లదాని మెళ్ళో దండ ఇవ్వను బాబూ" అన్న మాటలు జ్ఞాపకం వచ్చి మనస్సు కలుక్కుమంది. అయినా పాప మెళ్ళో పగడాల దండ బాగుంటుంది అని అనిపించింది. అర్ధరూపాయి ఇచ్చాను. ఇద్దామును కొన్న రూపాయగాని,

ఇస్తానన్న ముప్పావులా – రెంటినీ వదిలేసి అర్ధరూపాయే ఇచ్చాను.

వెంటనే అతను గేటు ప్రక్కనే టిక్కెట్టుకోసం నిలబెట్టి వుంచిన ముసిలిదాని పక్కనేవున్న బిడ్డ మెళ్ళోంచి దండ తీసి చేతికిచ్చాడు గాని, పిల్లది ఏడుపు లంకించుకుంది. అయినా అతను దండ నాకిచ్చేసి డబ్బులు అక్కడున్న టిక్కెట్టు కలెక్టరుకి ఇచ్చేశాడు.

ఆ పిల్లది ఏడుస్తూనే వుంది. నేను అక్కడ నుంచి మెల్లిగా కదిలాను. వాళ్ళు వెనకాలే నడుస్తున్నారు. నాలో ఏవో ద్వంద్వభావాలు యుద్ధం చేయటం మొదలుపెట్టినై. పాప మెళ్ళో దండ బాగుంటుంది. కాని అతని బిడ్డ మెళ్ళో దండ అతనికీ బాగుండబట్టే "బిడ్డ మెళ్ళోది బాబు, అమ్మను" అన్నాడు. అవే తిరిగి తిరిగి వినిపిస్తున్నయ్. అయినా మనస్సు నిబ్బరపరుచుకున్నాను. వాళ్ళు పూసల వాళ్ళే గనుక కావాలంటే ఇంకొకటి తయారుచేసుకొంటారు. అదీగాక నేను కాకపోయినా ఆ పరిస్థితిలో అత నెవరికైనా అమ్మేసేవాడే–అనుకుంటూ గబగబా నడుస్తున్నాను.

ముసిలిది ఏదో వాళ్ళ బొందిలీల భాషలోఅంటోంది. ఆ ధోరణినిబట్టి తిడుతోంది అనుకున్నాను. అతనుకూడ ఏదో సమాధానం చెబుతున్నాడు. ఆ పరిస్థితిలో అంతకంటే నేనేం చెయ్యను–అన్నట్లుంది అతని మాటల ధోరణి.

నాకు అర్జంటు పనుంది. అందులోను ట్రయిను లేటయ్యే. అంటు కని గబగబా నడుస్తున్నాను వెనుకల్లి అత

నితో ఇంకా గట్టిగా అరుస్తూ గబ గబా పరుగెత్తుతూ వచ్చి నాకు దణ్ణంపెట్టూ కాళ్ళు పట్టేసుకుంది.

ముసిలిది దింపిన పిల్లది కళ్లమ్మట నీళ్ళు కారుస్తూ ఏడుస్తూ ఏదో అంటూ పక్కన నిలబడింది.

"ఏమి"టన్నాను.

"మీకు దణ్ణమెడతాను బాబు, పిల్లముండ ఏడుస్తోంది. ఈ దండ వాళ్ళమ్మ పెట్టుకునేది అది సచ్చిపోయిన కాణ్ణుంచి దీని మెడలో పెట్టాను. మీతో సెప్పలేకపోతోంది గాని బాబూ, మా బాసలో తెగ గోల సేస్తోంది, వాళ్ళ అమ్మ దండ అని. దండంటే దానికి పాణం బాబూ! ఆ ముండ కొడుకు కూడ అమ్మేవాడు కాదు.

ఈలు లేకపోయి అమ్మాడు. మీకు కావాలంటే సూదులు పిన్నీసులు ఇప్పిస్తాను బాబు. మీ కాళ్ళట్టుకుంటున్నా దండ ఇప్పియ్యండి. మీ బిడ్డల పున్నెం" అంది.

నాకు కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినంత పనయింది. బిడ్డ మెళ్ళో దండ అన్నందుకే తీసుకోబుద్ధి కాలేదు. అది ఆ పిల్ల దాని తల్లిదట. ఇక జేబులో వుంచుకోవా లనిపించలేదు. వెంటనే తీసి ఇచ్చేశాను.

"మీరు మంచోరు, ఇస్తారనే సెప్పాను. 'నాకు మొగం సెల్లదు' అడగనన్నాడు బాబూ! సూడండి మీకు మొగం సూపలేక ఎనక, ఎనక నక్కుతున్నాడు" అంది ముసిల్ది.

నోటి మీదుగా అదే దండకు ముప్పావులా ఇస్తానని అతని అవసరాన్ని బట్టి అర్థరూపాయే ఇచ్చిన నన్ను "మీకు

మంచోరు బాబూ" అన్న ముసిలిదాని మాటలకు అంత రాత్మ గతుక్కుమంది అంతే. ఇక నిలబుద్ధి కాలేదు. మాట్లాడకుండా ముందుకు నడక సాగించాను. అప్రియ త్నంగా మళ్ళీ ఒకసారి "మానిసి అతను" అనిపించింది.

"బాబూ ఎళ్ళకండి. సూమలు, పిన్నీసు లట్టికెళ్ళుదు గాని" అంటోంది ముసిల్ది.

అయినా నాకు అది తీసుకోవాలనిపించలేదు సరిగదా "అక్కర్లేదు" అని చెప్పాలని కూడ అనిపించలేదు. పైకి అక్కర్లేదు అని మనస్సులో అనుకుంటూనే అడుగు తొందరగా వేసి సాగిపోయాను.

—0₀0—

# బ్రతుకు తెరువు

మంగళగిరి స్టేషనులో రైలు కదిలింది. రైలు కదుల్తూ కదుల్తూ వుండగా గ్రుడ్డివాడొకతడు కడ్డీపట్టుకొని పెట్టెలోకి జొరబడ్డాడు. చంకలో వుంచుకున్న మువ్వలు కట్టివున్న కర్రను క్రిందికి దింపి గళ్ళజుబ్బా ప్రక్క జేబులోనుంచి కర్ర చిరతల జత నొకదానిని తీసి విచిత్రంగా శబ్దంచేస్తూ "ఏమి జన్మం బేమి జీవనము, యీమాయకాయం బేమి జన్మం బేమి జీవనము" అనే తత్త్వం పాడి, ఆ తరువాత సినిమా వారి పుణ్యమా అని తలచుకోవటానికి సులభుణ్ణి చేసిన 'ఏడుకొండల స్వామి' లాంటివి మరో రెండు పాటలు శ్రావ్యంగా పాడాడు. "మాట శూద్రమాళ్ళైతేనేం గొంతు కమ్మగా వుంది" అని వ్యాఖ్యానించినదో బ్రాహ్మణ పూర్వసువాసిని. మొత్తం మీద రైలు కదలబోయే ముందున్న రణగొణ ధ్వని పోయి అంతా నిశ్శబ్దంగా వుంది.

పాడటం పూర్తి అయిం తర్వాత అతనో నమస్కారం చేస్తూ "తల్లి దండ్రులార! మీ అందరికీ నమస్కారం. రెండు కళ్లూ లేని కబోదిని బాబు! మీ అందరి మీద ఆధార పడిన జన్మాలు బాబూ! కుటుంబం కుటుంబం యావత్తు మీరు పెట్టే అన్నం మీద ఆధారపడి ఉన్నాం బాబూ. మీరంతా తలో రాగి డబ్బు ఇస్తే మా పొట్టలు గడుస్తాయి బాబు. మీరో సిగరెట్టు తాగి పారేసిన యిలువ లేదు బాబు!

మీరో కిల్లీ వేసుకున్న విలువ లేదు బాబు!" అంటూ చేయి చాచాడు.

"ఏడిశాడు! ఆ 'కామెంటు' ఎందుకు — అడిగే ధర్మం తిన్నగా అడక్క— సిగరెట్లు, కిల్లీల విషయం. నావరకు నేను ఓ పూట అవసరానికి, అన్నం నిద్రయినా మానుకోగలను గాని, సిగరెట్టు మానుకోను" అన్నాడు ఓ నాగరికుడు.

ఇచ్చిన వాళ్ళు ఇచ్చారు, లేని వాళ్లు లేదు. అతను కంపార్టుమెంటు అంతా తిరిగి తను నిలబడిన చోటుకే వచ్చి, కాసులు నయాపైసలు ఏరి చేతిలో వుంచుకొని, అంతకంటే పెద్ద విలువగల నాణేలు ఎడమవైపు జోబీలో వేసేసి చిరతల జత జోబీలో పెట్టుకొని నిలబడ్డాడు.

ఎవరో అన్నారు "తాడేపల్లి వచ్చింది, మరో పెట్టె లోకి దిగిపో" అని.

"అయిపోయింది బాబయ్యా! ఇక దిగిపోవటమే. చివరి పెట్టెదాక చూసుకొచ్చేశా. నంబూరు దగ్గర రైలు చాలా సేపాగింది ఎక్కినపెట్టె మళ్ళీ ఎక్కితే తిడతారు బాబూ" అన్నాడు.

నా ప్రక్కనే కూర్చున్న తోటి ప్రయాణీకుడు అతని జేబుల మీద కన్నులుంచి తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నాడు. చివరికి వుండబట్టలేక కామోసు అన్నాడు "ఇదిగో అబ్బీ! రోజు కేమాత్రం సంపాదిస్తావు?" అని.

"ఏదో లెండి, తిండికి లోటులేదు. భగవంతుడు

ఆ లోటిప్పటికి చెయ్యలేదు — గుడ్డోణ్ణయినా. గుడ్డోణ్ణి చెయ్యటం లోటొక్కటి తప్ప!"

"ఏం నీకళ్ళిలా పోయాయి. పుట్టినప్పటినుంచి లేవా" అన్నాడు మళ్ళీ అతనే.

"ఏమిటో లెండి బాబు, దేనిచేత పోతేనేం, కర్మం చేత పోయాయి" అన్నాడు నీరసంగా.

ఎలక్ట్రికలు పవరుహౌసు దగ్గరున్న గేటు దగ్గరకొచ్చి సిగ్నలు యివ్వకపోవటంవల్ల గామోసు రైలు విజయవాడ స్టేషనుకు వెళ్ళకుండా ఆగిపోయింది. బందరు కాలువ లాకుల వద్దకు వెళ్ళాలి గనుక నేను రెండణాల రిక్షా డబ్బుల ఖర్చు కలిసి వచ్చిందనుకుంటూ గబగబా దిగాను. వెనకాలే గ్రుడ్డి వాడూ దిగాడు.

"అబ్బీ! ఇది స్టేషను కాదు. గేటు దగ్గర ఆగింది బండి" అన్నాను. "అవును బాబూ! మా ఇల్లు యీడనే, బందరు గుడిసెల్లో" అన్నాడు చెయ్యెత్తి రోడ్డుకి కాలువకి మధ్యవున్న గుడిసెలు చూపిస్తూ.

నడిచే ప్రతి అడుగుకు అడుగుకు ముందు కర్ర విసురు కుంటూ కాలుదారి ఎన్ని వంకర్లుంటే అన్ని వంకర్లు తిరిగి గేటు దగ్గరకొచ్చి సిమెంటు రోడ్డెక్కాడు.

అతని వెనకాలే నడుస్తున్న నేను "ఏం? మీ వాళ్ళెవరూ నీవెంట రాకూడదూ? గ్రుడ్డి వాడివి కద! ఎక్కడన్నా పడితే?" అన్నాను.

"ఎవరి పొట్ట తిప్పలు వాళ్ళవి బాబు! ఇద్దరం వచ్చినా

ఈ నాలుగు డబ్బులే వస్తాయి. ఒకళ్ళయినా ఈ నాలుగు డబ్బులే. అయినా యింట్లోవున్న తొమ్మిదిమందిలో ఆడా, మగా అంతా కలిసి ఏడుగురం గుడ్డోళ్ళం. గుడ్డోళ్ళకి, గుడ్డోళ్ళు సాయం వచ్చి ఏం చేస్తారు బాబూ!" అన్నాడు.

"ఏమిటి! ఏడుగురు గ్రుడ్డివాళ్ళా మీ యింట్లో" అన్నాను

"అవును బాబూ! మా నాయన గుడ్డివాడు. మా అమ్మని గుడ్డిదాన్ని చేసుకున్నాడు. మేమంతా గుడ్డోళ్ళం" అన్నాడు.

తల్లీ దండ్రీ గ్రుడ్డి అయితే మాత్రం బిడ్డలు గ్రుడ్డి వాళ్ళు పుడతారా అని ఆలోచిస్తూ వస్తున్నాను ఏం మాట్లాడకుండా! బండరు గుడిసెలయి పోవస్తుండగా అతనక్కడో నాలుగు క్షణాలాగి "ఏవమ్మో వదినియ్యో!" అన్నాడు కాలువ వేపున్న గుడిసెలవేపు తిరిగి.

"ఆఁ ఏందిరా! ఇయ్యాలకాడ యిటు వూరెంపు పడ్డావు. బువ్వేలయితేను?" అంది గుడిసె ముందు నుంచోని పాతయినుప ముక్కల్ని దొంతరులుగా అమురుస్తున్న ఓ యువతి.

"ఈడకెటు పడ్డాను ఇల్లు తప్పిపోతా వుంటే నువ్వన్నా సెప్ప నైతివి. అయినా నీవెందుకు సెబుతావులే, నీ చెల్లెలన్నా అయితే చెప్పును గాని......"

"ఏం నాచెల్లెలికే మవసరం చెప్పేందుకు? పోనీ నేనన్నా అయితే 'పాపంపోనిలే' అని చెబుతున్నాను గాని."

"ఆఁ! అట్లాగే అను నీకేం తెల్సు! ఆ పిల్ల అయితే

ఈసరికి ఎదురు లగెత్తుకొచ్చి చెయ్యిచ్చుకొని ఇంటికాడ దిగడిచేది కదా!"

"ఆఁ ఆఁ! ఇట్లాగే అను ఎప్పుడో కాళ్ళిరగ్గొట్టద్ది. ఆ గుడ్డికి తోడు కుంటోడివి కూడ అవుతావు. సరిపోద్ది"

"ఏం అట్లాగే అంటాను. మాఅన్న మాత్రం నాకంటే ఎక్కువ సంపాదిస్తున్నాడెట్టా. గుడ్డోణయితే మాత్రం రోజు కయిదు రూపాయలు సంపాయించే మొగుడు నీచెల్లెలికి దొరకొద్దు వదినియ్యా! చెప్పు నీచెల్లెలికి" అన్నాడు నవ్వుతూ వెనక్కు తిరిగి.

"లేదురో గుడ్డోడ, మీ వోళ్ళు యింటికాడ లేరు. మీవాళ్ళు పై గుడిసెలకాడి కెళ్ళారు. మీ ముసల్ది బుడ్డాన్నెత్తు కెళ్ళింది. మీ వాళ్ళ గుడెసె కాడికి" అంది, ఆ అమ్మాయి వెనక్కు తిరిగిన గుడ్డి వాడిని వుద్దేశించి.

"మా అన్నగారి బుడ్డోడిని యెత్తుకెళ్ళారా! ఎందుకు, ఆడి కెందుకెత్తుకెళ్ళారు" అన్నాడు ఏదో అనుమానంగా. "మాఅన్న అత్తుందే - దాని చేతులకులే మంచివి కావు."

"ఏం అమ్మమ్మేమ్మగా?"

"అయితే నేం?

"అదుగో వస్తున్నారు. మీ ముసల్ది ఆడిని ఎత్తుకొస్తాందిలే" అంది. రిక్షా కోసరం అక్కడే నిలబడిన నేను దూరాన పోయే ఓ రిక్షాని చూసి రమ్మన్నట్లు చేయూపి నిలబడ్డాను.

ముసల్ది దగ్గరకొచ్చి "ఏందిరా యీడ నిలబడుండావు" అంది.

"ఏటే, బుడ్డోడేడే" అన్నాడు చేతులో కర్ర క్రింద పారేసి రెండు చేతులు చాస్తూ మువ్వ కర్ర క్రింద పట్టంతో ఘల్లుమంది. చంకలో పిల్లవాడు ఒక్కసారి గ్రుడ్డివాడి మాట గుర్తుపట్టి "బాపురు" మన్నాడు. "చిన్నయ్యా! ముసిలే... ముసిలే కళ్ళల్లో పాలు పోసింది చిన్నయ్యా!" అన్నాడు.

"ఆఁ!" అన్నాడు ఒక్కసారే గ్రుడ్డివాడు పిల్లవాడు ఏడుస్తున్న వేపు ఒక్క దూకు దూకి. "ఏమే ముసిలీ! ఏం జేశావే" అన్నాడు. ఆందోళన సుడులు తిరుగుతోంది ముఖంలో.

"ఏం జేసేదేమిటి! మీకు చేసిన పనే చేశాం! నీ మాటల కేంలే! ఇంకా నాలుగు రోజులు పోతే యీడు మాట యింటాడా. మూడేళ్ళు నిండీ నిండని గుంటడు నీ కిన్ని చాడీలు చెప్పేవాడు తరువాత యీడింకా యింటాడా? అందుకనే యీడినెత్తుకెళ్ళి ఈ పూట వాళ్ళమ్మమ్మ యింటికాడనే జిల్లేడుపాలు పోసిచేశా!" అంది తొణకకుండా!

"చావక పోయినావు లంజముండా! పండులాంటి బిడ్డ రెండు కళ్ళూ పోగొట్టావా బలవంతాన. ఆడి బతుకంతా నీ పొట్టనెట్టుకున్నావు గదే! పద. నీ తల పగలగొడతా" అన్నాడు. పిల్లాడు గబగబావచ్చి కాళ్ళకు చుట్టేసుకున్నాడు.

"సచ్చావులే. ఆ పనే సెయ్యకపోతే నిలువునా నువ్వే సచ్చేవాడివి. పూరికే నీకు రోజు కయిదు రూపాయి లెవడిచ్చేవాడు నా తొత్తుకొడుకా" అంది.

"నీ యవ్వ అరవమూకు. నాకే కళ్ళుంటే రోజుకు పది రూపాయలు సంపాదించే వాడినేమో ! నీకు తెలుసా నీవు జిల్లేడు పాలోడిచి ఇట్లా గుడ్డోడ్నిగా తయారుజెయ్యకపోతే. నీ యవ్వ! నీకు రోజూ చెప్పటం లేదంటే_ బిడ్డనేం చెయ్యొద్దని. రానీ, అన్న రానీ, నీ తల పగలకొడతాడు" అన్నాడు కాళ్ళకు చుట్టుకునివున్న బిడ్డ నెత్తుకొని గుండెల కద్దుకుంటూ.

"చిన్నయ్యా కళ్ళు మూసుకుపోతున్నాయి చిన్నయ్యా! కళ్ళు కాపట్టంలేదు చిన్నయ్యా" అన్నాడు బుజంమీద తల ఆనించిచాడు.

ఏదో రిక్షా ప్రక్కన వచ్చి నిలబడింది. ఏమీ మాట్లాడకుండా ఎక్కి కూర్చుని పోనిమన్నాను గాని కొంత దూరం వచ్చిన తరువాత అనిపించింది "అరెరె! పాపం కుర్రాడ్ని డాక్టరు దగ్గరకు తీసికెళ్ళమని అయినా చెప్పలేదే అని. కాని చాలా దూరం వచ్చేశాను. అప్రయత్నంగా ఒక్కసారి మాత్రం వెనక్కు తిరిగి చూసి నిట్టూర్పు విడిచాను. అంతకంటే ఏం జెయ్యటం ?

—0o0—

౧)




# చంద్రి

"రంగమ్మ"

"నే నండీ"

"వెంకటలక్ష్మి"

"నే నండీ"

"బాలమ్మ"

"నేను బాబూ"

"లక్ష్మమ్మ"

"నే నండీ"

"మరి నీ పేరు?"

"చంద్రి..." సగంలోనే నాలిక కరుచుకొని "నా పే రెందుకు, నే నిక్కడ కూలీ పని చేసే మనిషిని కాను" అంది ఆ అమ్మాయి.

"మరైతే యిక్కడి కెందు కొచ్చినట్లు?" అడిగాడు అధికారయుక్తంగా అడగాలో, అడగటం సభ్యత కాదో తేల్చుకోలేక బాధపడుతూనే, కొత్త వుద్యోగంలో చేరిన చిన్న మానేజరు మూర్తి, మళ్ళీ ఆ అమ్మాయినే!

"నా కోసం వచ్చిందిలెండి. ఆరింటికాడ పనిచేస్తూ వుంటాను నేను. నన్నేదో తొందర పనుందట, పిల్చుకొని పోదామని వచ్చింది." అన్నది సవినయంగా లక్ష్మమ్మ. 'మస్తర్' చూసి కూలీల నందర్నీ పరిచయం చేసుకుంటున్న

మూర్తితో, కొత్తగావచ్చిన చిన్న మేనేజరుగారికి తామంతా పూర్తిగా విధేయతతో మసలుకుంటామని మనవిచేసుకుంటా మన్నట్లున్నాయి ఆమె మొఖంలోని హావభావాలు ఏ భావము వ్యక్తంచేయని మొహంపెట్టి ఘూరుకున్నాడు మేనేజరు మూర్తి.

అతనికి ఎక్కడ ఏంమాట అనాలో; ఏంమాట అనకూడదో తెలియకుండావుంది. వున్న అనుమానాన్ని వెంటనే తీర్చుకునేందుకు విషయమేదో బయటపెట్టాలి. కాని తీరా బయటపడితే అనుభవజ్ఞులైన పనివాళ్ళు పట్టుకొని 'క్రొత్త మేనేజరు 'యిల్లా పుటుక్కున అనేశా'డని అనుకుంటారేమో! అనకుండా వుందామా అంటే 'అసమర్థు డనుకుంటారేమో' అని అతను మనస్సులో గుంజాటన పడుతూనేవున్నాడు. ఇందాకనూ అంతే! ఆ అమ్మాయి వాలకాన్ని చూసి 'కూలీ మనిషి' కాదేమో అనుకుంటూనే మరి వీళ్ళతో వున్నప్పుడు తెలుసుకోవటం తన ధర్మం గనుక, అదోరకమైన ప్రత్యేక ఆకర్షణ వున్నా, నిరాడంబరంగా వున్నా 'ఆ అమ్మాయి' వీళ్ళలో ఒక మనిషి కాకపోవటానికి కారణమేమీ లేదుగనుక 'మరి నీ పేరు' అన్నాడేగాని ఇప్పుడు వీళ్ళంతా తన యీ ప్రశ్నలను ఏమనుకున్నారు అని ఆలోచిస్తూ నిలబడిపోయాడు.

కాని లక్ష్మమ్మ ఆ అమ్మాయి వెంట నాలుగు అడుగులు వేయటం చూసి; "లక్ష్మమ్మా" పిలిచాడు మూర్తి.

లక్ష్మమ్మ వెనక్కు తిరిగివచ్చింది.

"ఇప్పు డెక్కడికి వెళ్తున్నావ్ పనివేళలో..."

"చెప్పానుగా బాబూ! ఆ అమ్మాయిగారు నాకోసం వచ్చిందని. ఆ చంద్రమ్మగారింటికాడ నీళ్ళు పోసిరావటాని కెడుతున్నానండీ."

మూర్తి ఒక్క క్షణం మాట్లాడకుండా నిలబడ్డాడు. 'ఇదేమిటి పనిలోని కొచ్చిన మనిషి ఎవరింటికో పోయివస్తా నంటుందేమి' టన్న భావం అతని మొఖంలో కనిపించింది. 'సరేకాని చూద్దాం ఈ విషయం తర్వాత' అనుకున్నాడు మనస్సులో. పై కేమీ మాట్లాడకుండా మెల్లిగా నిర్మాణం సాగుతున్న మెషీన్‌షెడ్డు వైపు కదిలాడు.

ఆ అమ్మాయితో వెళ్ళిన లక్ష్మమ్మ తిరిగి మళ్ళీ పని లోకి రావటం క్రొత్తగా కడుతున్న మెషీన్‌షెడ్డులో వుండి చూసిన మూర్తి 'ముప్పావుగంట అయింది వెళ్ళి' అను కున్నాడు. ఏదైనా తొందరపడి ఎవరినీ ఏవిధంగాను అనటం అతని స్వభావం కాదు. కాని అతన్ని చూసినవాళ్ళు మాత్రం అతన్ని గురించి ఆవిధంగా అనుకోరు.

పెద్దవిగా వుండే అతని కళ్ళల్లో 'లోతులు' కని పించవు. కేవలం చిన్నవాడి కళ్ళలాగ ఆలోచనా రహి తంగా కనుపిస్తాయి. కాలేజీనుండి క్రొత్తగా వచ్చిన అతని వేషం పట్నంలో స్నేహితులతో కులాసాగా గడపటంలో అతనికి పట్టుబడిపోయిన అలవాట్లు కొంచెం పల్లెటూరి వాళ్ళకి – ముఖ్యంగా పట్టణపు నాగరికతకు అలవాటుపడని

వాళ్ళకి అతన్నిచూస్తే అదోకరకమైన భయాన్ని కలిగిస్తాయి. దీనికి ఎర్ర జీర వున్న అతని కళ్ళు మరింత సహకరిస్తాయి.

మూర్తి క్రొత్త వుద్యోగంలో నాలుగైదు రోజులు గడిపాడు. ఈ క్రొత్తచోటు, వుద్యోగమూ అతని కేమీ తోచకుండా వుంది. ఈ నాలుగు రోజుల్లోనూ మైలు పొడుగునా, మైలు వెడల్పునా వున్న తా ముండే 'మెషీనరీ యార్డు' షుమారుగా పది పదిహేనుసార్లు తిరిగాడు. వీలున్నన్ని సార్లు మెషీనరీ యార్డు ప్రక్కనే వున్న గార్లదిన్నె స్టేషనుకు తిరిగాడు. గార్లదిన్నె నుండి అనంతపురం వేపు రెండు, గుంటకల్ వైపు వెళ్ళే రెండు రైళ్ళు అతని దినచర్యలో కాస్తంత కులాసా కాలక్షేపానికి పనికొచ్చే కాలాలయ్యాయి. కాని అతని హోదా ఈ రకం కాలక్షేపానికి అడ్డుపడింది.

పోతే ఈ నాలుగు రోజుల్లో అతను తెలుసుకున్న విషయాలలో ఒక్క లక్ష్మమ్మ గాకుండా మిగతా పనివాళ్ళు కూడా మన పెద్ద మేనేజరుగారింట్లో, అక్కౌంటెంటుగారి యింట్లో యింకా అక్కడా అక్కడా—పోయి వారికి కావలసిన పనులు చేసివస్తూనే వున్నారు. అందుకుగాను కంపెనీపని ఆగిపోవలసివస్తే ఆగిపోతూనేవుంది. ఇది కంపెనీకి నష్టంకాదా అనుకున్నాడు మూర్తి. దీన్ని కంపెనీ అసిస్టెంటు మేనేజరుగా జరుగకుండా చూడాల్సిన బాధ్యత తనది అనిపించింది. అయితే తనకంటే హోదాలో వయస్సులో పెద్దవాడైన మేనేజరుగారు దీనికి ఎందుకు పూనుకోలేదు? ఈ సంగతులు ఆయనకు తెలియనివి గావుగా—అనుకున్నాడు. అనుకుంటూ

గడియారం చూసుకున్నాడు. అయిదుగంటలైంది. దూరంగా మేనేజరుగారింట్లో పనిచేసే కుర్రాడు తనవైపుకే వస్తున్నాడు. సాయంత్రం కాఫీ టైమయింది గనుక టీ గాని కాఫీగాని త్రాగకపోవటంవల్ల తలనొప్పిగా వుందని అతనికి పెద్ద మేనేజరుగారు పంపిన కుర్రాణ్ణి చూస్తేనేగాని జ్ఞాపకానికి రాలేదు. కుర్రావాడు వచ్చి "అయ్యా" అని పిలువగానే, "వస్తున్నా పదరా" అని గబగబా అతనివెంట మేనేజరుగారి బంగళాకు వెళ్ళాడు. దాన్నందరూ బంగళా అంటారుగాని అది మూడు గదుల యిల్లు. ముందు వరండాలో సగంవరకూ ఆయన ఆఫీసు గది. వరండా వెనుక ఆయన పడకగది, దానెదురుగా వంట భోజనాలగది. చుట్టూ "ఫెన్సింగు" కోసం వేసిన క్రతుమ్మ మొక్క లింకా పైకిరాలేదుగనుక మైలుపొడుగునా మైలు వెడల్పునా వున్న ఆ "మెషీనరీ యార్డు"లో ఆయన ఇల్లొక రోడ్డుమీద మైలురాయిలాగ కన్పిస్తూ వుంటుంది యార్డుకు ప్రతి చివర ఒకటి రెండు వరుసల్లో "వర్కర్ల" గుడిసెలు కట్టుకున్నారు. అకౌంటెంటుగారికి, గుమాస్తాలకు, యింకా కొంచెం పెద్ద యింజనీరింగు మేస్త్రీలకు మేనేజరుగారికి యిచ్చినట్లు రాతిగోడలుతో కట్టిన రెండుగదుల యిళ్ళు అక్కడొకటి, అక్కడొకటి ఫర్లాంగురాళ్ళలాగ కనిపిస్తున్నాయ్.

అతనితోబాటు టీ పూర్తిచేస్తున్న మేనేజరుగారు ఏదో అడగాలన్న భావాన్ని వ్యక్తంచేస్తున్న మూర్తి వంక "ఏమిటో అడగాలనుకుంటున్నట్లున్నారు?" అన్నాడు.

"ఆ! ఏమీలేదండీ. ఈ వర్కర్లలో కొంతమంది పనిలోనుంచి అప్పుడప్పుడూ మానేసి వెళ్ళిపోయి స్టాఫులో వాళ్ళకీ వీళ్ళకీ ఏనో పనులు చూసివస్తుంటారు మరి . . . ."

"ఆ విషయమా? సరయితే! ఆయ నో చిరునవ్వు నవ్వి "ఆ విషయాన్ని గురించి మన మొకసారి మళ్ళీ మాట్లాడు కుందాం. మీ బంగళాపని ఎంతవరకూ పూర్తయిందో చూశారా?"

ఇదేమిటి యీయన యీ తిరుగు ప్రశ్న వేశాడు. బహుశా నే నుండటం వీరికేమైన కష్టంకలిగిస్తోందేమో, అను కున్నాడు మూర్తి. "నేలకు సున్నంపని తప్ప అంతా పూర్తయి పోయిందండీ. నేను రేపే ఆ యింటిదగ్గర మకాంపెడదామను కుంటున్నాను" అన్నాడు. నిజంగా రేపే అతను ఆ యింటికి వెడదామని కాదుగదా; ఎప్పుడు వెడదామనే విషయాన్ని కూడా అత నాలోచించలేదు. ప్రస్తుతం తనకున్న ఉద్దేశానికి అనుగుణంగా అనేశాడు. కాని అతనుకోనివిధంగా జరిగిన విషయం మరొకటికూడావుంది. మర్యాదకోసమైనా మేనేజరు గారు యింకో నాలుగురోజులపాటు తమయింట్లో వుండమని అంటారనుకున్నాడు. కాని ఆయన "మీ యిష్టం పోనీ రేపటి వరకూ భోజనం మాయింట్లోనే చేసివెళ్ళండి. ఎల్లుండినుండి ఏర్పాట్లు చేసుకుందురుగాని" అన్నాడు.

♦ ♦ ♦

మర్నాడు రాత్రి భోజనంచేసి మేనేజరుగారి యింటి వద్దనుంచి వస్తున్న మూర్తికి లక్ష్మమ్మ కనుపించింది.

“లక్ష్మమ్మా! ఎక్కడి కెళ్ళొస్తున్నావ్. నీవు వుండేది ఆవైపు గుడిసెల్లో అన్నట్లున్నావుకదూ?” అన్నాడు. “అవునండీ. నిజమేగాని గుమాస్తాగారి భార్యకు పిండిపట్టటం చేతగాకపోతే పొద్దుగుంకే వేళ ఆడకెళ్ళి అక్కణ్ణుంచి పూర్ణానందంగారింటికెళ్ళి కొంచెమేదో కూర తెచ్చుకుంటున్నాను”

“పూర్ణానందమంటే.........”

“పెద్దపెద్ద మెకానిక్కుగారు బాబూ! మొన్నరాలా–చంద్రయ్యగారు–ఆయుష్మగారి తండ్రి. ధర్మాత్ముడు”...అర్ధోక్తిలో తెగిపోయిన మూర్తి వాక్యాన్ని పూర్తిచేసింది లక్ష్మమ్మ. మరొక క్షణం విధేయతగా నిలబడి “వెళ్ళొస్తానండీ. సెలవిప్పించండి” అంటూనే కదిలింది లక్ష్మమ్మ.

చచ్చీచెడి క్యాంపుకాటు బిగించి, క్రిందపడితే దుమ్ముకొట్టుకొని పాడైపోతున్న కొన్ని గుడ్డల్ని మంచంమీదనే ఒకమూలవుంచి ఏదోవిధంగా పడుకొని నిద్రపోయాడు మూర్తి.

తెల్లవారి ప్రొద్దెక్కిగాని నిద్రమెళుకువ రాలేదు. ఆ క్రొత్తయింట్లో చుక్కయినా నీళ్ళులేవని అతనికి అప్పటికిగాని జ్ఞప్తికి రాలేదు. బ్రష్, పేస్టు చేతిలో వుంచుకొని మెల్లిగా వాకిట్లోకివచ్చి నిలబడ్డాడు. కొంచెం బాగానే ప్రొద్దెక్కిందేమో, అందరూ అప్పుడే పనిలోకి వచ్చినట్లున్నారు. క్రొత్తచోటవటంతో ప్రొద్దుపోయేవరకూ నిద్రపట్టకపోవటంతో ఒళ్ళంతా విరగ్గొట్టినట్లుగావుండి ప్రొద్దెక్క–

నిద్రలేచినా బద్ధకంపోలేదు. మామూలుగా అమర్చిన యిల్లయితే గబగబా ముఖం కడుక్కోవచ్చు. స్నానంచేయొచ్చు ఇప్పటికి యింకే సదుపాయమూలేదు. చేసేదిలేక చూస్తూ నిలబడున్న మూర్తికి దూరాన్నుంచి లక్ష్మమ్మ రావటం కనుపించింది.

మూడు నాలుగు నిమిషాల్లో లక్ష్మమ్మ దగ్గరకొచ్చి "బాబూ యిప్పుడే నిద్రలేచారా? క్రొత్తచోటు పాపం! నిద్రపట్టలేదో ఏమో" అంది.

"అవును లక్ష్మమ్మ! యిప్పుడే నిద్రలేచాను. ఈ నీళ్ళలారీ ఎన్నిగంటల కోసారి యిలా వస్తుంది?"

"ప్రొద్దున రెండుసార్లు, సాయంత్రం ఒక్కసారి వచ్చే సరికే అయిపోతుంది వాళ్ళపని. మొదటిసారి రావటం అయిపోయింది. రెండోసారి మధ్యాహ్నం ఏ పదకొండు గంటలకోగాని రాదు. అప్పటిదాకా ఎందుకులెండి బాబూ! ఆ నీళ్ళ డబ్బా యిలా యివ్వండి. మొఖం కడుక్కునేందుకు ఈ డబ్బాతోనూ, తమరు స్తానంచేసేందుకుగాను మా కడవతోనూ నీళ్ళు తెచ్చియిస్తాను. మొఖంకడుక్కుని స్తానం చేద్దురుగాని" అంది. మారుమాట్లాడకుండా మూర్తి వాటర్ బాటిల్ లక్ష్మమ్మ కందించి అలా చూస్తూ నిలబడిపోయాడు.

"ఈ లక్ష్మమ్మ ఎవరి కేం గావాలో తనంతట తనే తెలుసుకుని చొరబడి మరీ పనిచేస్తుందనుకుంటాను. అవును ఈ లక్ష్మమ్మ ఒకర్తేనన్న మాటేమిటి? అందరూ అలాగే కనిపిస్తున్నారు. ఇంకానయం, ఆరోజు విషయ మాలోచించ

కుండా "వాళ్ళింటికి వెళ్ళటానికి వీల్లేదు" అనలేడు. తీరా యిప్పుడు స్వంత పనులు చేయించుకోవటానికి అవకాశమే ఉండేదిగాదు. ఈ పనులెవ్వరయినా చేసిపెట్టకపోతే స్వయంగా ఎలా చేసుకోవాలి? కనీసం హోటళ్ళయినా లేవు— డబ్బు పారేసి చేయించుకోటానికి. కాని అందుకని అందరిలాగనే ఏదో ఒక ఉద్యోగం పేరుతో వాళ్ళకి జీతమిస్తూ ఇలా పనులుచేయించుకుంటే ఎలా? పోనీ ఉద్యోగపు హోదాను బట్టయినా కంపెనీవాళ్ళు ఒక నౌకర్నో, కుర్రాణ్ణో యివ్వనే లేదు. బహుశా యీ విషయాలు గమనించే పెద్ద మేనేజరు గారు కంపెనీపనికిగాను జీతమిస్తున్నా అవసరాలబట్టి పని వాళ్ళను కాస్తంత బయటపనులకు వదులుతున్నారను కుంటాను. అంతేకాదు యీ విషయాన్ని నేను ఆలోచించ కుండా ఆయన్ను ప్రశ్నవేశానని, నాకు తెలిసిరావాలనే ఆయన వెంటనే తమ ఆతిథ్యాన్ని ఇవ్వటం మానుకొని వుంటాడు. అమ్మయ్యో! ఈయన చాలాఉద్దండుడు లాగు న్నాడు. పెదివు విప్పకుండా సమాధానంచెప్పాడే! "ఈ విధంగా అతని ఆలోచన సాగిపోతూనేవుంది. లక్ష్మమ్మ వాటర్ బాటిల్, కడవతో నీళ్ళు రెండూ తెచ్చి అక్కడవుంచి "బాబూ మరో గంటాగి వస్తాను, ఇసుకజల్లిస్తున్నట్లున్నారు. తోడుపట్టాలి నే పోయి" అంది. ఉలిక్కిపడి తిరిగిచూసి "సరే అలాగే కాని" అన్నాడు బ్రష్ తీసి నోట్లో పెట్టుకుంటూ.

మొఖంకడుగుకోవటం పూర్తయింతరువాతగాని కాఫీ కావాలన్న విషయం గుర్తుకురాలేదు. నిన్నటివరకూ కాఫీ,

భోజనాలు వాళ్ళింట్లోనే నయ్యే. లక్ష్మమ్మ మళ్ళీ మరో గంటకుగాని రానన్నది. 'సరేకాని స్నానం చేద్దా'మనుకొని స్నానంచేశాడు. బట్టలు అవీ వేసుకొనేసరికి పావుతక్కువ పదీ అయ్యింది. ఇంకా అప్పుడు కాఫీ యేం కాఫీ అని భోజనానికే సిద్ధమయ్యాడు. లక్ష్మమ్మ క్రిందటి రోజున ఏదో మాటమీద రైలుకట్ట దాటి కాలుదారినేపోతే నాలుగు రోడ్లు కలసినచోట నాయరొకాయన రోడ్డుప్రక్కన పెట్టిన కాఫీహోటలుందని, ఆయన అవసరానికి భోజనంపెట్టి తను తర్వాత మళ్ళీ వండుకు తింటాడని చెప్పింది.

పదిన్నరయ్యేదాక గది విడిచిపెట్టకుండా కూర్చుండి పోయాడతను. అప్పటికి లక్ష్మమ్మ వచ్చింది. వస్తూ "బాబు గారు రోజు ఈసరికి, కాఫీ త్రాగేవారు కామోసు. పాపిష్టి దాన్ని నాకా సంగతి జ్ఞాపకమేరాలేదు. మరిప్పుడేం చెయ్య మంటారు బాబూ! అయ్యయ్యో! పాపం పదిగంటలపైన అయిపోయిందే. పోనీ స్టేషను దగ్గరున్న హోటలుకు వెళ్ళి కాఫీ పట్రానా"అంది. స్టేషనుదగ్గరే కాఫీ తెప్పించుకుందామని మొదట అనిపించిందిగాని "పోనీలే ప్రొద్దెక్కిందిగా! ఆ కాలు దారెటో చూపించు, ఆ రోడ్డు ప్రక్కనున్న నాయరుదగ్గర కెళ్ళి భోజనమేచేస్తా" నన్నాడు. ప్రక్కనున్న తాళాలుతీసి, వేసి తాళంచేతులు చేతికందించి ముందు దారితీసింది లక్ష్మమ్మ. దారి వెళుతూ ఈ లక్ష్మమ్మ చిన్నప్పట్నుంచీ వున్న యింటి నౌకరులాగా యింతచనువుగా 'బాబుగారూ! బాబుగారూ' అంటుంది ఎంతచక్కటి మనసు; అందుకనే

పిల్ళ్ళు, వాళ్ళు అనక అలా తిరుగుతుంటూంది గామోసు' అనుకున్నాడు. లక్ష్మమ్మ రైలుకట్టవరకూ వచ్చి కాల్దారి చూపించి వెనక్కు వెళ్ళిపోయింది.

కొత్తదారిగనుక మైలున్నర నడవటానికే అరగంట పట్టి పదకొండుకి అక్కడికి చేరుకున్నాడు. మెషనరీ ఫిట్లరు డ్రైవర్లు నలుగురు ఆయునకగ్గర భోజనానికి సిద్ధంగా కూర్చున్నవాళ్ళు మూర్తిని చూడగానే అలజడిగా లేచారు!

నాయరుగారు ఏమి టన్నట్లుగా చూశాడు వాళ్ళందరి వంక. "మేనేజరుగా రేదో పనిమీద వచ్చారు. క్యాష్ తాగుతా రనుకుంటాను" అన్నాడు అందులో ఒకడు కాస్త ధైర్యంగా.

"కాదు భోజనానికే వచ్చానండీ. మీరు రోజూ భోజనంపెట్టగలరా" అడిగాడు మూర్తి. నాయరు అసాధ్యుడు. వాళ్ళ అలజడిబట్టే అతనికున్న హోదా వగైరా సరిగానే ఊహించుకొని "తప్పకుండాను. తర్వాత మాట్లాడుకుందాం. ముందు భోజనం చెయ్యండి" అన్నాడు ఒక కుర్చీ, టేబులు ఒకవైపుకు లాగుతూ.

భోజనముచేసే లోపుగానే అదీ, యిదీ, వడ్డిస్తూ వాటిని అక్కడికి సంపాదించటానికి తను పడే కష్టమంతా చెబుతూ నాయరు రేట్లు వగైరా అన్నీ చెప్పేశాడు. మిగతా వాళ్ళందరూ ఏదో భయంగా, కూర్చోలేక వెళ్ళలేక అక్కడే తచ్చాడుతూ తమ స్వాతంత్ర్యానికి భంగం కలిగినట్లుగా బాధపడుతూ మసలుతున్నట్లు తోచిందిమూర్తికి. అప్పాటున

యివ్వవలసిన డబ్బులిచ్చేసి చక్కా వచ్చేశాడు మళ్ళీ మిషనరీ యార్డుకు మూర్తి.

పనిజరిగే స్థలానికి చేరుకొనేసరికి పన్నెండు అయిపోయి పెద్ద షెడ్డులో బెల్లుకొట్టారు. అందరూ బయటకు వెళ్ళిపోతున్నారు. ఒకపూటంతా తాను పనిముఖం చూడలేదన్నమాట అనుకున్నాడు మూర్తి. రెండుగంటలవరకూ కుర్చీలో కూలబడి వుండివుండి మెల్లగా లేచి యంత్రాలను నేలలో బిగించటానికి సున్నంపని చేస్తున్న పెద్దషెడ్డుకివెళ్ళి అటూయిటూ తిరిగాడు. మూడైంది. స్టేషనుదగ్గరున్న హోటలుకు పోయి కాఫీ త్రాగాడు. కాని తలనొప్పి తగ్గలేదు. యిక పనిమీద తను చేయవలసిన పర్యవేక్షణ మానివేసి నాయరు హోటలు వైపుకు దారితీశాడు.

రెండు మూడు రోజులు గడిచింతరువాతగాని తెలిసిరాలేదు— తనిలా భోజనం, కాఫీలు చూసుకోవటానికి ఆఫీసు పనికి టైములేదని. పెద్దమేనేజరుగారి దగ్గరకెళ్ళి వున్నసంగతేదో చెప్పి కంపెనీ తరుపున కుర్రాణ్ణొకణ్ణి వేయించమని కోరాడు— కానీ ఆయన "వేరే చెకింగు ఏముండదుగదండీ. ప్రత్యేకించి మీకు వేయమంటే కంపెనీవాళ్ళు ఏమైనా అనుకోవచ్చు. ఇప్పటికి అది కంపెనీకి అలవాటులో లేనిపద్ధతి. కాకపోయినా యిక్కడ మీ మాట కాదనేవాళ్ళు ఎవరుగనుక" అన్నాడు.

పై ఆఫీసువాళ్ళకు తెలియకుండా మేనేజరుగారు చెప్పినట్లు వాళ్ళచేత, వీళ్ళచేత పనిచేయించుకోవటం అతనికి యిష్టంలేదు. వేరే స్వంత ఖర్చులమీద కుర్రాణ్ణి వేసుకోవ

టానికి కుర్రాడుకూడా దొరకను ఆపత్రలో. వున్నవాళ్ళంతా కంపెనీని నమ్ముకొని ఎంతో కాలంగా వుంటున్నవాళ్ళుగాని మామూలుగా దొరికే కూలీరకం లాంటిది కాదు. తనొక మనిషిని వాళ్ళల్లో కుదుర్చుకోవటానికి భోజనాలు వగైరా చూసుకునేసరికి టైమైపోతోంది. ఒకరోజు అప్పుడే రాత్రి భోజనానికి వెళ్ళి తిరిగివచ్చిన మూర్తికి నిత్య సమస్యగా తయారైన భోజనం విషయం గురించి స్వయంగా వంట చేసుకోవటం మంచిదని సలహాయిచ్చింది లక్ష్మమ్మ. తర్వాత ఆలోచిద్దామనుకొన్నాడు మూర్తి. లక్ష్మమ్మ వెళ్ళిపోయింది. లోపలకు వెళ్ళి మామూలుప్రకారం మూలనుండే లాంతరు కోసం వెతుక్కున్నాడు కొంతసేపటికి మేనేజరుగారి లాంతరు వాళ్ళు తీసుకెళ్ళారని జ్ఞాపకమొచ్చి కళ్ళవెంబడి నీళ్ళు వచ్చినై ఎలాగో తడుముకొని పడుకొందామనుకొన్నాడు. కానీ ఏమీ కనపడక తవుళ్ళాడుకోవటం నానా బాధా అయింది. చివరకు నిద్రకూడా పట్టక లక్ష్మమ్మ యింటివైపు బయల్దేరాడు. దారిలో ఎక్కణ్ణుంచో వస్తున్న లక్ష్మమ్మ కనుపించి యింటికి పోయి ఓ చిమ్నీ తెచ్చియిచ్చి 'పోనీ ఆడవాళ్ళ నెవళ్ళనైనా తెచ్చుకోనన్నా తెచ్చుకోండి' అంది.

"లక్ష్మమ్మా, రాత్రికి యింటిలోకి లాంతరు లేదని జ్ఞాపకంలేని నేను యింకా వంట ఏం చేసుకొని తినగలుగుతాను" అన్నాడు తను. అప్పుడు తన ఎదుటనున్న లక్ష్మమ్మ తన తగ్గర పనిచేసేవాళ్ళల్లో ఒకర్తె కాదు.

"బాబూ! పగలల్లా పనిచేసి యింటికొచ్చే మీకు యింటిలో విషయాలు జ్ఞాపకముండమంటే వుంటాయా? పోనీ మీ వూరెళ్ళి ఆడంగుల్ని ఎవర్నయినా తీసుకొచ్చు కోండి. మీ కేమన్నా చేసుకొని తింటం చేతనౌతుంద గనకనా? పాపం! యిప్పటికే ఎట్లా అయిపోయారో చూడండి" అంటూ వెళ్ళిపోయింది.

ఆ మాటలు విని నవ్వుకున్నాడు తను. ఏదో అతిర మ్మున్కట్టంటే అబ్బిందిగాని, ఆత్మీయులు, తనకు రోజూ అన్నం వండిపెట్టే వాళ్ళెవరు వస్తారు ఆ అరణ్యంలోకి. తల్లీ తండ్రి లేకపోతే మేనత్త పెంచింది. మేనత్త మొగుడు చదువు చెప్పించాడు. ఆయన స్నేహితుడే వుద్యోగం యిప్పించాడు. తను చదువుకున్న మెకానికల్ బి. యి. డిగ్రీవల్ల మెషినరీ నడపటానికి తప్ప మనుషులతో ప్రపంచములో ఎలా తిరగాలో కాలేజీలోవున్న అయిదారేళ్ళలోనూ అతను నేర్చుకోలేదు.

♦ ♦ ♦

వచ్చి మూడు నెలలైంది. డిశంబరురోజులు వచ్చినై. మూర్తి భోజనం ఏదో తెప్పించుకునే ఏర్పాటు చేయించు కున్నాడుగాని చివరకు స్నానం చేసేందుకు నీళ్ళుకూడా యాతన యిపోయింది. ఎప్పుడో రాత్రిపూట వచ్చి నీళ్ళలారీ వాకిట్లో వుంచిన 'డమ్ము'లో నీళ్ళు పోసిపోతే తెల్లారేసరికి అవి మంచుపడి మరింత చల్లగా అయిపోతై. డిశంబరు చలి రోజులలో రాత్రంతా రేకుల పైకప్పు క్రింద వడవడా వణు

కుతూ పడుకొని ప్రొద్దున్నే ఈ నీళ్ళు పోసుకోవటమంటే ప్రాణంమీదకు వచ్చినట్లుండే దతనికి.

ప్రతిరోజూ పడిసెం, తుమ్ములూ విపరీతంగా మొదలైనై. ఊనుకు పోయి డాక్టరుతో పరీక్ష చేయిస్తే 'ఇస్నోఫిలియా' వుంది రక్తంలో. చన్నీళ్ళ స్నానం, మామిడికాయ మొదలైన వూరగాయ పచ్చళ్ళు, ఉల్లిపాయ, సోడా యింకా యితర జలుబుచేసే వస్తువులు ప్రొద్దుపోయేదాకా మేలుకోవటం, ఎండలో ఎక్కువగా తిరగటం యివన్నీ పనికిరా' వన్నాడు.

చివరకు స్వయంగా వంట పెట్టుకుంటేనేగాని కుదిరే టట్లు ,లేదనిపించింది. కనీసం స్నానం నీళ్ళ కోసరకున్నా కుంపటీ, బొగ్గులూ మొదలయిన సరంజామా తీసుకొచ్చుకో వాల్సి వచ్చింది. లక్ష్మమ్మ కలుపుగోరు మనిషేగాని కావల్సినస్తే పనులు చేసిపెట్టగలనుగాని, వంటచేయటం— వేపుళ్ళు అవీ చేసిపెట్టటం కుదరదంది.

చివరకు తప్పక తనే స్వయంగా వంటకు పూనుకున్నాడు మూర్తి, అంతో యింతో వున్న చిన్నప్పటి అనుభవంతో.

◆ ◆ ◆

ఎంతైనా వంటకు, యింటికి ఆడవాళ్ళు అతికిపోయి నట్లుగా మొగవాళ్ళకు కుదరదు. పగలంతా యంత్రాలను కూర్చటం పర్యవేక్షించి, వాళ్ళకు కావలసిన సలహాలను,

ఆర్డర్లనూ జారీచేసి, కావలసిన విడిభాగాలకు చిల్లర సాహూనులకు కంపెనీలకు వ్రాసి యింటికివచ్చి పప్పూ ఉప్పూ సంగతి అంతసేపువరకూ జ్ఞాపకముండేవి గావు.

ఆ రోజురాత్రి అతను యింటికివచ్చే సరికి వళ్ళంతా జ్వరంవచ్చినట్లుగావుంది. తీరా చూసుకుంటే బియ్యం 'నిండు' కున్నాయ్. కుంపటి వెలిగించి స్నానమన్నా చేద్దాం చికాకుగా వుందని నీళ్ళుపడేసి మంచంమీద కాస్తంతసేపు నడుం వాల్చాడు. మళ్ళా మెలుకువ వచ్చేసరికి రెండయ్యింది. వళ్ళు కాస్త విశ్రాంతి పొందటంచేత కాస్తంత తేలికగానే వుందనిపించింది. గబగబా లేచి తలుపుగడియ వేసివచ్చి, కాగు దింపేసి పడుకొని నిద్రపోయాడు. మళ్ళీ ఉదయం తొమ్మిదికిగాని లేవలేదు. లేచేసరికి బాగా పడిసెం పట్టటం చేత వళ్ళంతా 'భారం'గా వుంది. కాఫీ కాచుకొని త్రాగి ఒక గంట తేలికగా వుంటుందని అల్మారా దగ్గర కెళ్ళాడు గాని కాఫీపొడికూడా అయిపోయిందని అప్పటికిగాని జ్ఞాపకం రాలేదు. ఛీ వెధవ ఉద్యోగం, రాజీనామా యిస్తే బాగుణ్ణనుకున్నాడు. కానీ మామయ్య ఎవరో స్నేహితునిద్వారా యిప్పించిన ఉద్యోగం పోగొట్టుకొని యింటికి వెళ్ళితే వాళ్ళేమనుకోవాలి. 'మూడు, నాలుగు రోజులు శెలవన్నా పెట్టి చూస్తే' అనుకున్నాడు. ముందు ఎవరైనా కుర్రాణ్ణన్నా పంపించి కాఫీ తెప్పించుకోవాలనుకుంటూ వాకిట్లోకి వచ్చాడు.

పనిపాటల్లో మునిగి తేలుతున్న ఆ మనుష్యులు బంగళా కేసి ఎవరూ చూడలేదు చాలాసేపటివరకూ. కేక వేసి పిలవటానికి నాగరికత అడ్డొచ్చింది. స్వయంగా వెళ్ళి పిలవటం పరువునష్టంపని. అలాగే మనుష్యు లెవరు యిటువైపు తిరిగి చూస్తారా అని చూస్తూ నిలబడ్డాడు. అలా నిలబడ్డాడుగాని కొంచెంసేపటిలో అతని దృష్టి శూన్యదృక్కులు సారించి మనస్సు పనిచేయటం మొదలుపెట్టింది.

పెద్దచదువు చదువుకున్నానుగదా! ఏం ఫర్వాలేదు పెద్దఉద్యోగమే చెయొచ్చు అనుకుంటూ వుండేవాడు ఉద్యోగంలో చేరేవరకూ. కాని ఉద్యోగముండీ, చదువు వుండి కూడా సుఖం అనుభవించలేని రోజు వుంటుందని ఈనాడు తెలిసింది. ఏ లోటూ లేకుండా పెరిగాడు. ఇంజనీరింగు కాలేజీలో వేళకు సరిగా షుమారు రెండురూపాయల ఖరీదు చేసే ప్లేటు ముందుంచేవారు– డెబ్భయిరూపాయలు పోతేనేంగాక నెలకు! కాని యిటువంటి ప్రదేశాలలో డబ్బుకూడా ఏం ప్రయోజనాన్ని సాధించలేకపోయింది. ముందుముందు ఉజ్వల భవిష్యత్తు వుంటుందని ఈ కంపెనీలో చేర్చారు. భవిష్యత్తు మాట ఎలావున్నా పడేబాధమాత్రం ఎక్కువగా కనిపించింది. యింతకూ అతనికి తట్టింది; చివరకు తనకిప్పుడున్న కొరత ఆత్మీయు లనేవాళ్ళు దగ్గరెవరూ లేకపోవటమని. ఆత్మీయులనే వాళ్ళుంటే యింతకంటే అరణ్యమైతేమాత్రం అరణ్యమిది అని అనుకోవాల్సిన అవసరం వస్తుందా అనుకున్నాడు. కానీ

ఆత్మీయులు కావాలంటే ఎక్కడనించివస్తారు. పెద్దతలను కొను క్కనే హాస్యకథ జ్ఞాపకానికి వచ్చింది. నవ్వుకున్నాడు.

ఇంతలో బంగళావైపు రోడ్డుమీద కూలీ ఒకడు నడుస్తూవుంటే అతణ్ణి పిలిచి రెండురోజులకు శెలవు వ్రాసిన చీటి పెద్ద మేనేజరుగారి కివ్వమని, వస్తూ కాఫీ పోయించు కొని పట్రమ్మని చిల్లరడబ్బులిచ్చి పంపించి కూర్చున్నాడు. అరగంటకు అతను తిరిగొచ్చాడు గాని ఫలితం శూన్యం. స్టేషనులో కాఫీ అయిపోయింది. మళ్ళీ రెండుగంటలకే కాఫీ దొరకటం అతను కుర్చీలో కూలబడ్డాడు.

ఒంటిగంటవేళ లక్ష్మమ్మ వచ్చింది. "ఆ రంగడు యిప్పుడు చెప్పాడుబాబూ మీరు ప్రొద్దున్నుండి కాఫీ త్రాగ లేదని. కాఫీ నే చేసిపెట్టనా? భోజనంచెయ్యరా? వంట్లో బాగా లేదా?" నక్కసారి వస్తూనే ప్రశ్నల వర్షం కురిపిం చింది.

మరో సమయం అయితే అన్ని ప్రశ్నలకు విసుక్కుండే వాడేగాని ఆమాత్రం మాట్లాడేవాళ్ళు లేకపోవటం ఆ విసు గుని పైకి రానివ్వలేదు. అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పి చివరకు కాఫీపొడి లేదని చెప్పాడు.

"అదేమిటి! అయితే కాఫీ మానేస్తారా. ఉండండి. నే కాఫీ పట్టుకొస్తా" నని వెళ్ళి కాసేపట్లో కాఫీ తెచ్చి యిచ్చింది.

ఆకలిచేతనో యిన్నాళ్ళనుండి తను చేసుకున్న కాఫీ కుదరకనో ఆ కాఫీ అమృతంలాగావుంది. ఇక ఆరోజు

సాయంత్రం తంవరకు ఏమీ లేకపోయినా యిబ్బంది లేదనుకున్నాడు. "కనీసం యిలాంటి కాఫీ అయినా దొరకదు రోజూ" అనుకున్నాడు. వెంటనే "లక్ష్మమ్మ! యీవేళప్పుడు మేనేజరుగారింట్లో కాఫీ వుందా? మేనేజరుగారు సాయంత్రం టీ త్రాగుతారనుకున్నాను - కాఫీ త్రాగుతారా" అన్నాడు.

"మేనేజరుగారింట్లో కాదుబాబూ. ఇది చంద్రమ్మగారింట్లో కాఫీ...అదేనండీ మన సీనియరు మెకానిక్కు పూర్ణానందంగారింట్లోది. తల్లి లేని పిల్లయినా పాపం ఆమె ఆయన కే లోపంరాకుండా అలాగా చేసుకొస్తోంది. ఆయనగారు రెండుగంటలకు కాఫీకి యింటికొస్తారని ఈసరికే కాఫీ చేసిపెడ్తుంది" అంది.

'ఆ! అంత అమాయకంగా, చిలిపిగావున్నా ఆ అమ్మాయి అంతటి బుద్ధిమతా! గారాబాలు కులుకుతూ, కూనిరాగాలు తీస్తుందేమో ననిపించే ఆమె అంతటి వివేకవతా!' మనస్సులో అనుకున్నాడు మూర్తి. "నేనుకూడా ముసలివాణ్ణయిపోయా ననిపిస్తోంది లక్ష్మమ్మా. అలా నా గురించికూడా ఎవరైనా శ్రద్ధతీసుకొని వేళకింత అన్నంపెట్టి, కాఫీయిస్తే ఎంతబాగుండును" అన్నాడు మెల్లిగానవ్వుతూ.

"బలేవారు బాబుగారు.....ముసలమ్మగారు రాకుండానే, అబ్బాయిలు, అబ్బాయిలకి అబ్బాయి పుట్టకండానే!

పోనీ అంతకష్టంగావుంటే భోజనం ఏర్పాటు సంగతి ఏమైనా ఆలోచిద్దాముండండి" అంటూ వెళ్ళిపోయింది.

♦ ♦ ♦

పూర్ణానందం ఇంటికొస్తూ పరిపరివిధాల ఆలోచించటం మొదలుపెట్టాడు. మేనేజరుగారు ఉన్న విషయాన్ని విప్పి చెప్పారు. ప్రస్తుతం చిన్నమేనేజరుగారికి యిబ్బందిగావుంది గనుక భోజనంపెట్టటం సహాయమవుతుంది. బాగానేవుంది కాని అది అలాగాక తను మరోవిధంగా ఆలోచించుకున్నట్లు ఏదో ఆశతో చేస్తే, ఆ ఆశలు ఫలించకపోతే జీవితాలతో చెర్లాటలాడిన ట్లౌతుంది. యింతకూ పెద్దమేనేజరుగారు తన మంచే ఆలోచించి "నీ కేం పర్వాలేదులేవయ్యా, మూర్తి చాలా మంచివాడు. చేయదలుచుకుంటే ఏ పనైనా మనస్ఫూర్తిగా చేస్తాడు. వారికి అనురాగాలు కలిసితే మీ అమ్మాయిని చేసుకుంటాడు. లేదా అవసర సమయంలో అతన్ని ఆదుకున్నవాళ్ళవుతారు. తబ్బిబ్బులొస్తే సర్దుబాటుచేసుకోనేందుకు నే నున్నానుగా" అన్నారు. కాని ఈవిషయం అమ్మడుతో ఎలా చెప్పటం? ఏ విషయం యిన్నాళ్ళు నాలో దాచుకోకుండావుండి, యిప్పుడు యీ వుద్దేశ్యంతో ఈపని చేస్తున్నానని చెప్పకుండావుంటే ఎలా?.....కాని ఆత్మశుద్ధితో మంచికోరకు చేస్తున్నాను గనుక ఈ విషయాన్ని కొంతకాలం గుప్తపరచినా పర్వాలేదు— అనుకున్నాడు పూర్ణానందం. పూర్ణానందం చాలా ఋజువర్తనుడు. నిజాయి

తీకి అతను గీటురాయి. అల్పవిషయాలకోసమని అనల్పమైన అభిమానాన్ని ఎన్నడూ వదులుకోడు.

రాత్రి ఆమె కూర్చుని చదువుకోబోతుంటే "అమ్మా! నీకో విషయం చెప్పాలనుకున్నా! విషయం పూర్తిగా నీయిష్టం మీదనే ఆధారపడివుంది. మన కంపెనీకి క్రొత్తగా వచ్చిన మేనేజరుగారు లేరు—మూర్తిగారు—పాపం! ఆయన యీ ఆఫీసు పనులతో సతమతమౌతూ తిండీ, నీళ్ళు అమరక చాలా బాధపడుతున్నారట. పెద్దమేనేజరుగారు మన కిష్టమైతే కాస్తంత వీలుచేసుకొని భోజనం పెట్టగలమేమో అడగమన్నారు. నేను నీ యిష్టం అని చెప్పానురా తల్లీ!" అన్నాడు.

"అదేమిటి నాన్నా! అట్లాఎందుకు చెప్పారు. మనకెక్కడ వీలవుతుంది. నీకు తెలియందేముంది నాన్నా? నేను నీదగ్గర వంట నేర్చుకున్నాను. నీవూ నేను అంటే ఏదో వుడకేసుకు తింటున్నాము. ఆయనకు మనవంట లేం నచ్చుతై? అదీగాక మనం డబ్బులుతీసుకొని పెట్టటానికి ఏమన్నా హోటలా మనయిలు? డబ్బులేకుండా ఎట్లాగు పెట్టే శక్తిమంతులమూ కాదు......"

"హోటలుకాదుగాని, ఆయన అవసరంలో వున్నారు. పాపం! అందుకని......"

"అదికాదు నాన్నా! ఆయన ఆఫీసు మేనేజరు. నీవు ఎంత సీనియరు మెకానిక్కువైనా ఆయనకంటే తక్కువ

వుద్యోగం. శ్రేష్ఠుడన శాస్త్ర 'సాన్నిహిత్యం' ఏర్పడిన తరువాత ఒకరకంగా రాదు. ఎటొచ్చి ఎటుపోయినా మనకే బాధ—అరిటాకు ముల్లు సామెతలాగు !"

"అది నిజమే తల్లీ ! కాని యీ విషయం స్వయంగా పెద్దమేనేజరుగారు చెప్పారు. అందుచేత ....."

"అదిగాదు నాన్నా ! ఆ చిన్నమేనేజరుగారు మాట్లా డటంకూడా చాలా గడుసరితనంగా మాట్లాడుతాడు. ఆ కళ్లు ఎర్రజీరలతో భయంగా వుంటాయి. ఆయన ఉత్తపట్నపు మనిషినాన్న నేను ఆయనతో అసలు మాట్లాడలేను. అలాం టప్పుడు యింకా భోజనం ఏం చేసిపెట్టగలను ?"

"నేనూ అలాగే అనుకున్నానమ్మా మొదట్లో ! కాని యిప్పుడిప్పుడు తెలుసుకుంటున్నాను, ఆయన వ్యవహారం. నిష్కర్షగా మాట్లాడతాడేగాని కుళ్ళు వుంచుకోడు. అలా అచ్చపు బస్తీవాలకంగా, రౌడీలాగా కనపడినా మనిషి చాలా పెద్దమనిషి."

"అదికాదు నాన్నా ! నీ కెలా చెప్పాలో తెలియ కుండావుంది. ఇంట్లో వేరే ఆడవాళ్ళు లేరుకదా ! పెళ్ళి కాని పిల్లను. తీరా తరువాత లోకులేమైనా అనుకుంటే బాధ పడాల్సొస్తుంది" అంది తలదించుకునే.

పూర్ణానందం ఆలోచనలో పడిపోయాడు. తన కూతురు నిజంగా బంగారం. ఆమెకనుకనే తనకు దిగులు లేకుండా యింతవరకూ యీడ్చుకొచ్చింది యీ సంసారాన్ని- అనుకున్నాడు. ఆమె యిష్టానికి వ్యతిరేకంగా వెళ్ళి తరువాత

బాధపడేకంటే ముందే జాగ్రత్తవహించటం మంచిది. అమ్మడే నయం! చాలాదూరం ఆలోచించుకొని—"పోనీలే తల్లీ! మేనేజరుగారితో చెబుతాను. ఆయనమాట అక్కడనే కాదంటే నిర్మొహమాటంగా వుంటుందని అలా చెప్పాను. తరువాత ఏమైతే అవుతుంది, కుదరదని చెబుతాను." అన్నాడు ఒక అభిప్రాయానికొచ్చి.

కాసేపాగి ఆమె అంది "పోనీలే నాన్నా! ఓ పదిహేను యిరవై రోజులపాటు చేసిపెడతానని చెప్పు. మరీ కుదరదంటే పెద్దమేనేజరుగా రేమనుకుంటారో. ఒక కంపెనీలో పనిచేస్తున్నవాళ్ళ మయ్యే! మన వంట లవీ ఎలాగూ ఆయనకు నచ్చనూ నచ్చవు. ఆ తరువాత ఆయనే మానేస్తారు. కాకపోయినా తరువా ఏమిటీ— ఆయనే ఎవర్నో ఒకర్ని తీసుకొచ్చుకుంటాడు వాళ్ళవాళ్ళని. నాలుగు రోజులపాటైనా సర్దుకోలేదని మేనేజరుగా రేమైనా అనుకోవచ్చు. మరీ బాగుండదేమో కుదరదంటే" అంది.

పూర్ణానందం కాసేపాలోచించి లేచి బయటకు వెళ్ళిపోయాడు

◆ ◆ ◆

మూర్తికి పూర్ణానందంగారి యింట్లో భోజనం ఏర్పాటు కొంత హాయినిచ్చింది. పని వుత్సాహంగా సాగిపోతోంది. ఒక్క వారంరోజుల్లో పదిహేను యిరవై రోజులుగా బకాయిపడిన పనిని పూర్తిచేసి యికముందు చేయాల్సిన నిర్మాణాల "ప్లాను"ల పరిశీలనకు పూనుకున్నాడు.

సాయంత్రం ఆయిదుగంట లౌతుండగా అనుకోకుండా అతన్ని యిన్నాళ్ళనుంచి పెంచి పెద్దచేసిన మేనత్త ఒక్కగా ఒక్కకొడుకు చంద్రం దిగాడు. అతను అకస్మాత్తుగా రావటం, అందులోనూ ఎప్పుడూ యిల్లువదలని చంద్రం ఒంటరిగా రావటం మూర్తికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఏమిటి చంద్రం ఉత్తరమన్నా రాయకుండా బయల్దేరావ్" అన్నాడు.

"నీ క్రొత్తఉద్యోగం ఎలావుందో చూడాలనిపించింది బావా. నువ్వు యింతదూరం వచ్చావుకదా పట్నంవదలి నిన్ను చూసినట్లౌతుంది, యిక్కడ వూళ్ళెలా వుంటాయో, యిక్కడివాళ్ళెలా వుంటారో చూసినట్లవుతుందని బయల్దేరాను. అమ్మ నీకు భోజన సదుపాయం కుదిరిందో లేదో, ఎలావున్నావో చూసిరమ్మంది. డిశంబరు శెలవులుయిచ్చారుగా. అనుకోవటం ఆలస్యంగా బయల్దేరాను" చాలా ఉత్సాహంగా అన్నాడు చంద్రం. చంద్రం ఫిఫ్తుఫారం చదువుతున్న కుర్రాడైనా మాటల్లోనూ, ఆటల్లోనూ బలేసరదా. బావతో కబుర్లుచెప్పటమంటే మరీ సరదా.

మూర్తికి మళ్ళీ సమస్య కలిగింది. చంద్రం రావటం అతనికి సరదాగానేవుందిగాని ఎవరింట్లోనో భోజనంచేస్తున్న తను ఇతన్నిగూడా తీసుకెళితే వాళ్ళే మనుకుంటారో ఏమో. అని మధనపడ్డాడు. చుట్టపుచూపుగా వచ్చినవాణ్ణిగురించి ఏమనుకుంటారులే అని సమాధానపడ్డాడు. పడకపోయినా తప్పదుగా!

సాయంత్రం అటూయిటూ తిరిగి బావమరుదులు యిద్దరూ కలసి పూర్ణానందంగారింటికి వెళ్ళారు. కానీ ఆయ నింట్లో లేడు. "నాన్నగారు పొరుగూరు వెళ్ళారు నెయ్యి తేవ టానికి. మీరొస్తే భోజనంచేసి వెళ్ళమన్నారు." అంది ముందుగదిలో అప్పుడే అడుగుపెడుతున్న మూర్తినిచూసి పూర్ణానందంగారి అమ్మాయి వంటయింటి గుమ్మంలో నిల బడి తలవొత్తుకుండా.

రోజూ భోజనం అతనూ పూర్ణానందంగారూ కలిసే చేస్తారు. అప్పుడు 'కావాలి, వద్దు' అనే రెండుమాటలు తప్ప వేరే మాటలుండవు. అంతచిన్నపిల్లను 'ఏమండీ' అనటం బాగుండదు. పోని పేరుపెట్టి పిలుద్దామా అంటే కొంత అర్హతలేని స్వాతంత్ర్యం తీసుకున్నట్లవుతుందని భయపడేవాడు మూర్తి. అందుచేత "పోనీ మరల మీ నాన్నగారొచ్చింతరు వాత మళ్ళీ వస్తాము. మా బావకూడా వచ్చాడండీ యీ పూట" అన్నాడతను, యింకా ఏదో చెప్పాలని ఆగుతున్న ట్లుగా.

"అందుకని వెళ్ళిపోతానంటున్నారా? ఫర్వాలేదు. మా నాన్నకేం చెప్పనక్కరలేదు. ఆయన్నుకూడా భోజనంచేయ మనండి. ఎంతసేపూ! నాన్న వచ్చేలోపు మళ్ళీ వంట చేస్తాను" అంది. ఆమెలోని సౌజన్యానికి, సముయానుకూలతకు అతను మెచ్చుకున్నాడు. భోజనంఅయి వెళ్ళబోతూ వెళ్ళ బోతూ "మా చంద్రం నాలుగురోజులపా టుంటాడని మీ నాన్నగారితో చెబుదామనుకున్నాను, మీ నాన్నగారు యింట్లో లేకపోయారు......"

"దానికేంలెండి నేను చెబుతాను......"

ఒక్కక్షణం నిలబడి మూర్తి ఏమీ చెప్పటానికిలేదని పించి బయటకు వచ్చేశాడు. వెంటే చంద్రం నడిచాడు.

రెండురోజుల్లో చంద్రం, 'మెషినరీయార్డు' చుట్టూ పాతికసార్లు తక్కువలేకుండా తిరిగాడు. స్క్రేపర్లు, డంపర్లు, యూక్లిడ్సు, రోడ్డురోలర్లు, ఎక్స్కవేటర్లు, బుల్డోజర్లు వరుసలు వరుసలుగా వున్నాయి. ఎంతసేపుతిరిగినా అవేచూడటం, విసుగుపుట్టింది. మైముగడపటం కష్టమనిపించి చంద్రం ఆ షెడ్డు యీ షెడ్డు తిరిగి బావగదికొచ్చి పుస్తకాలసెల్ఫు అంతా వెతికాడు పత్రికలకోసం. ఇంజనీరింగు పుస్తకాలు తప్ప ఏమీ దొరకలేదు. అతనికి చటుక్కున జ్ఞాపకం వచ్చింది.

గబగబా పూర్ణానందంగారి యింటికివెళ్ళాడు తలుపు వేసుంది. మొదట పూర్ణానందంగారూ అని పిలుద్దామనుకొన్నాడు. కాని ఆయన యిందాక పెద్దషెడ్డులో పనిచేస్తుండటం చూశాడు. లేడని తెలిసికూడా ఆయన్ను పిలిస్తే బాగుండదేమో ననిపించింది. అందుకని "ఏమండీ! ఏమండీ" అని పిలిచాడు. 'ఆమె పేరేమిటో ఏమో!' మనస్సులో అనుకున్నాడు.. మళ్ళీ "ఏమండోయి అక్కగారూ! ఓ అక్కగారూ! ఓసారి తలుపుతియ్యండి." అన్నాడు పెద్దగా. ఆమె వచ్చి తలుపుతీసి ఏమిటన్నట్లు చూసింది. "ఇదగో అక్కగారూ, మీ యింట్లో యిందాక వచ్చినప్పుడు చాలా పుస్తకాలు చూశాను. మా బావేమో పనిలో మునిగిపోయాడు.

అందులో ఏదైనా నవలయిస్తే చదువుకొని మళ్ళీ యిచ్చేస్తాను."

"అయితే నన్ను 'అక్కగారూ' అని పిలవమని ఎవరు చెప్పారు నీకు" అంది. చంద్రాన్ని గురించి ఆమెకే విధమైన అభిప్రాయం లేదుగాని తనను 'అక్కా' అని; మూర్తిని బావా అని యిద్దరినీగురించి ఒకేసారి ప్రస్తావించటంలో ఆమె కదోరకంకా అనిపించింది. చంద్రాన్నిగురించి ఏమీ అనుకో లేదుగాని మూర్తి ఒకవేళ అలా అనమని అనిపించాడేమో నని ఆమె వుద్దేశ్యం. ప్రేమా ప్రేమ అని సినిమాల్లోనూ కథల్లోనూ చెప్పుకోబడేదానికి ప్రపంచందృష్టిలో ఏమీ విలువలేని వస్తువు. అస లలాంటివాటికి తావివ్వకుండా వుండ టము సంప్రదాయకులైన కుటుంబాలవాళ్ళు చేయాల్సిన పని అలాంటప్పుడే పిల్లలు బుద్ధిమంతురాలంటారు. ఏది ఏమైనా తనకు తెలుసున్నంతవరకూ ఒకవేళ అతనేమైనా ప్రేమ—అలాంటి దేమైనా వుద్దేశ్యం మనస్సులోవుంటే వాటికి తాను సుదూరంగా వుండాలని ఆమె ఉద్దేశ్యం. కాని ఆ వుద్దేశ్యంతోనే తను అంతదూరం ఆలోచించుకుంటూ పోయి నందుకు చాలా సిగ్గుపడి చిన్నగవ్వనవ్వింది మనుష్షణంలో.

ఆమె అన్నమాటలకు సమాధానంగా చంద్రం "ఏమని పిలవమంటారు. మీ పేరు నాకు తెలియదు. అయినా తప్పే ముంది. అక్కా అని పిలవటం తప్పా" అన్నాడు

"అబ్బే తప్పని కాదు......" అంది ఏం చెప్పేందుకూ లేక. వెంటనే "అదిగో అలావెళ్ళి అందులో మీకు

కావలసింది తీసుకోవచ్చు" అంది. అతను వెళుతూ "నేను మీకంటే చిన్నవాణ్ణిగా, మీరు పేరుపెట్టి పిలవండి ఫర్వా లేదు. నాపేరు చంద్రం. ఇంతకూ మీపేరేమిటో నాకు తెలియదు......" అన్నాడు.

"నాపేరు చంద్రిక" అందామె.

"చంద్రికా...బలేపేరు. చంద్రికంటే వెన్నెలట మా తెలుగు మాస్టారు చెప్పారు. మీరు వెన్నలా" అన్నాడు నవ్వుతూ.

"అవునట. మా నాన్నగారూ చెప్పారు నాకు చిన్న ప్పుడు" ఆమెకూడా నవ్వింది.

అతను పుస్తకమొకటి తీసుకొని వెళ్ళిపోయాడు చంద్రం వెళ్ళిపోయిన తరువాత ఆమె అదోరకంగా ఆలో చిస్తూ వుండిపోయింది. ఆమెకు తా నొంటరిదా న్ననిపించిం దప్పుడు. తనకు అలాంటి తమ్ముడొకడుంటే ఎంతబాగుం డేదో. పిల్లాడు చంద్రబింబములాగ వున్నాడు. అతను ఫిప్త ఫారం చదువుతున్నాట్ట. అయినా చిన్నవయస్సు. వయస్సు చిన్నదైనా మర్యాదా కలుపుగోలుతనము ఎక్కువ అను కుంది.

తర్వాత రెండురోజుల్లోనే చంద్ర మామెకు పాతవాడై పోయినాడు 'తమ్ముడూ, తమ్ముడూ' అని ఆమె అతన్నెంతో ఆదరించింది. అత నామెకు వాళ్ళ బస్తీ విశేషాలు, అమ్మను గురించీ, నాన్న ఉద్యోగం గురించి, బావ చదువునుగురించీ, తన ఆటలనుగురించీ ఎన్నో చెప్పాడు. మెద్రాసొస్తే ఒక

సారి వాళ్ళింటికి రమ్మన్నాడు. ఇలా రమ్మని పిలచేటప్పుడు 'ఈమె మద్రాసు ఎందుకువస్తుంది?' అనుకున్నాడు. 'ఏమో వస్తే...వచ్చినా రాకపోయినా ఆమెను రమ్మని చెప్పాలి' అనిపించింది. ఆమె నవ్వింది.

◆ ◆ ◆

చంద్రం వుండటం మూర్తికి చాలా సరదాగానే వుందిగాని 'మా కష్టంగురించి ఈయ నేమీ అర్థం చేసుకోడేం' అని పూర్ణానందంగారూ, కూతురు అనుకుంటా రేమోనని భయం. కానీ చంద్రం ఆ నాలుగు రోజుల్లోనూ ఒక క్రొత్త వాతావరణాన్ని సృష్టించాడు. ఆఫీసరుగా తను పోలేని మూలలన్నీ చంద్రం గాలించి ఒక నివేదిక సమర్పించాడు. ఎడారిలో బిడారుల గుంపు ఒకచోట గుడారాలు కట్టుకొన్నట్లు, ఆ మెషినరీ యార్డుచుట్టూ కట్టుకొన్న వివిధ తరగతి ఉద్యోగులమీద, కూలీలమీద తదితర పరిసరాల మీద అతని వాక్ నివేదిక సమగ్రంగావుంది. మూర్తి అప్పుడే స్వయంగా ఆపీసరు హోదాలో వెళ్ళినప్పుడు విధేయతచూపే జనంలో వారి జీవితం కొంతే చూడగలిగింది. చంద్రం వారి మిగతా జీవితాన్ని పరిచయం చేశాడు.

గానుగెద్దులాగ విసుగెత్తివున్న అతని జీవితం నాలుగు రోజుల్నుంచి కాస్తంత హాయిగా వున్నట్లనిపించింది. కాని చంద్రం ఆ రోజు వెళ్ళాలనుకోవటం మూర్తికి — ఒక్క మూర్తి కేనన్నమాటేమిటి చంద్రానికికూడా యిష్టంలేదు. అదీగాక మూర్తి వుదయం 'బెడ్' మీదనుంచి లేవ లేనంతగా

రొంపపట్టి కదలలేకుండా వున్నాడు. చంద్రమే వెళ్ళి కాఫీ తెచ్చియిచ్చాడు. మూర్తి కాఫీ త్రాగుతుంటే చంద్రమే అన్నాడు "బావా! నే నింకో రెండురోజు లుంటే వాళ్ళు ఏమైనా అనుకుంటారా?"

అతనూ అదేవిషయాన్నిగురించి ఆలోచిస్తున్నాడు. చంద్రంకూడా అదేవిషయాన్ని గురించి ప్రశ్న వేసేసరికి మూర్తి కాస్త అదోరకంగా బాధపడ్డాడు. "ఛా! వాడు మరో రెండు రోజు లుంటానంటే దాన్ని సమస్యగా చేసుకుంటున్నాను. నే నింకా ఏం చెయ్యగలుగుతాననుకున్నాడు." మెల్లిగా లేచి తువ్వాలు బుజాన వేసుకొని పూర్ణానందంగారి యింటికి బయల్దేరాడు.

పూర్ణానందంగా రింటిదగ్గరే వున్నారు. మూర్తిని చూస్తూనే "రండి! కూర్చోండి" అన్నాడు.

మూర్తి కూర్చుంటూనే "మీతో ఓ విషయం చెబుదామని వచ్చాను. మా చంద్రం నాలుగురోజులనుంచీ వుండిపోయాడు. మీకా విషయం గురించి చెబుదామనుకుంటూనే రోజూ కలుస్తూకూడా చెప్పలేదు; మీ అమ్మాయితో చెప్పానుగాని! వాడికీ నాకు కూడా వాడింకా రెండురోజులుంటే బాగుండు ననిపించింది. మరేంలేదు మరో రెండురోజులు మీకు మరి కొంత శ్రమ కలుగ జేయాల్సి వస్తోంది......"

"ఫర్వాలేదు, దానికేంలెండి! అదేమంత పెద్ద శ్రమ గనుక! ఇట్లాంటి ఎడారి వంటి వూళ్ళలో మనకు చుట్టాలు

మాత్రం ఎవరొస్తారు చెప్పండి. వచ్చినా ఎవరుంటారు ఆత్మీ
యులు తప్ప" అన్నాడు వెంటనే అందుకుంటూ తేలికగానే.

ఒక గంటసేపు అక్కడే వుండి భోజనంచేసి ఏకంగా
తిరిగివచ్చాడు మూర్తి ఆఫీసు వేళకు.

ఆ రోజు ఉదయం భోజనం చేశాడన్నమాటేగాని
చెయ్యకుండా వుంటేనే బాగుండేదనిపించింది మూర్తికి.
మధ్యాహ్నం రెండుగంటలనుంచీ తుమ్ములు తుమ్మీ తుమ్మీ
పొట్టంతా కదలిపోయి లోపలున్న ఆహారమంతా పెద్ద బరు
వుగా తోచి, ఎగశ్వాస వచ్చి ప్రాణం 'హైరాణ' అయి
పోయింది. అయినాకూడా తుమ్ములు తగ్గనేలేదు. నాలుగు
న్నర అయ్యేసరికి నాలుగు వందలసార్లు అయినా తుమ్మి
వుంటాడతను.

సాయంత్రం అయిదుగంటలయిందిగాని చంద్రం
ఎక్కడికి వెళ్ళాడో కనిపించలేదు. మూర్తి యింటికి వచ్చి
ఆఫీసునుండి, పైజమా వేసుకొని ఉన్ని శాలువా ఒకటి
బుజాన వేసుకొని మెషినరీ యార్డు దాటి 'వంక' వైపుకు
నడచివెళ్ళాడు అతనెప్పుడైనా సాయంత్రం అలా షికారుకు
వెళ్ళుతూవుంటాడు. ఆ 'వంక'కు వర్షాకాలంలో కొండలపై
నుండి వచ్చిన నీరు వస్తుంది. వంక నీళ్ళు చాలునే ఈతచెట్లు
అటూ యిటూ గుంపులుగా వుంటాయి. వంకలో నీళ్ళు
వున్నప్పుడు అటూ యిటూ వున్న ఈతచెట్లు గట్టులాగా
వుండి మధ్యలో నీరు పోతూవుంటుంది వేసవికాలంలో
మాత్రం నీరెండిపోయి ఈతచెట్లు మధ్యవున్న తెల్లని

యిసుక పార్కులో 'క్రోటన్సు సర్కిల్'ని జ్ఞాపకానికి తెస్తుంది! మూర్తి ఒక ఈతచెట్ల గుంపులో దూరి చేయి తల క్రింద పెట్టుకొని పైన శాలువా కప్పుకొని పడుకున్నాడు. అతని ఆలోచనలన్నీ చంద్రం అతనికి సమర్పించిన నివేదిక మీాదకు పోయినై. ఇక్కడ అంతా ఈ ప్రత్యేక ప్రపంచంలో బ్రతుకుతారంటే యిక్కడున్న ప్రతి ఒక్కరికీ ఆఫీసు కాక తలకొక వేరే వ్యాసంగ ముందన్నాడు చంద్రం.

వెంకట్రామయ్యా, రంగారావు, శరభయ్యా, రాఘవులు వీళ్ళంతా పేకాడతారట.

ముకుందరావు, శ్రీనివాసులు – వీళ్ళు వీలున్నప్పుడల్లా ఈ పన్నెండు మైళ్ళు సైకిళ్ళు త్రొక్కుకుని అనంతపురంపోయి టౌనులో సినిమా చూసి వస్తారట.

గుమాస్తా చంద్రశేఖరం, ఆయన భార్య కూర్చుని చదరంగంలో మునుగుతారట.

సూపరువైజరు రమణమూర్తి కాస్తంత 'చుక్క' సేవించి రెండుపూటలా వాలుకుర్చీలో పడి నిద్రపోతాట్ట. గుమాస్తాగారి ముసలాయన వేదాంత పుస్తకాలు ఈ చెట్ల లోనే కూర్చుని చదువుతూ వుంటాడట. మేస్త్రీ సుందరరావు యిక్కడకూడా వీలున్నప్పుడల్లా నాటకాలు ఆడుతాట్ట.

అవునుమరి! యిలాంటి బ్రతుకులు బ్రతకటానికి అలవాటుపడాలి. యిక్కడ యిమిడిపోయేందుకు సులువైన సదుపాయమేదో అందరూ ఆలోచించుకున్నారు. తానుకూడా యిక్కడ పనిచేసేవాడేగా! తానుకూడా అలా యిమిడి

పోవాలి. చదరంగం, క్యారమ్సు, డబ్బులు పెట్టకుండా పేకాట ఆడగలడుగాని తనకు తగిన 'పార్టనర్' వుండొద్దూ! ఇక్కడ తనకు 'చచ్చి' ఒక హోదా వున్నదయ్యె! దీంతో కలిసే వాడెవ్వడు? చంద్రం యిహా లా రేపు వుంటాడు. తరువాత అతనెందు కుంటాడు.

పోని పెళ్ళిచేసుకుంటే తను? ఆ జీవితపు భాగస్వామి యీ చిక్కులన్నీ తీరుస్తుందేమో. కాని బస్తీ నుండో మరో చోటనుండో వచ్చే ఆ క్రొత్త వ్యక్తికి యీ వాతావరణానికి తనలాగే దడిస్తే బ్రతుకు మరీ నరకయాతన కాదూ?

అయితే యిలాంటి వాతావరణానికి అలవాటుపడిన చంద్రిలాంటి వాళ్ళయితే...అవును చంద్రి చిచింకీలాంటి పిల్ల. ఒకళ్ళకి బాధ కలుగకుండా సర్దుకుపోవటం ఆమెకు చేతనౌను తనకున్న వాతావరణానికి అనుగుణంగా అతుక్కుపోయే మనిషి. నాలుగు రోజుల్నుంచీ చంద్రం ఒకటే చెబుతున్నాడు; నిరాడంబరంగా ఆమె గడిపే జీవితసరళినిగూర్చి. తనూ చూస్తూనే వున్నాడు ఆమె అభిరుచులూ, అలవాట్లు! ఆ యిల్లంతో శుభ్రంగా వుంటుంది. పుస్తకాలూ, సామానులు చక్కగా అమర్చివుంటాయి. తండ్రికి కావలసినదీ, నెలాఖ్ళకు పైగా తననూ, వేళతప్పకుండా అన్నీ సమర్థించుకుంటోంది. కాస్తంతతీరికకాగానే పుస్తకాలు చదువుకుంటూ కూర్చుంటుందట. వాలుజడని, పూలజడని ఎంతోమంది ప్రక్కల యిళ్ళలో పిల్లలు ఆమెచుట్టూతిరిగి పనులు చేయించుకుపోతారట.

లక్ష్మమ్మకు ఆ అమ్మాయిఅంటే ప్రాణం. ఆ అమ్మాయి యీ ప్రత్యేక ప్రపంచంలో తలలో నాలుకలాగ కలిసిపోయింది. పోనీ ఆమెనే తను పెండ్లాడితే......

"తాతగారూ; తాతగారూ......"

"ఆమెగొంతులా వుందే" మూర్తి ఆలోచనలు ఒక్క సారి ఆగిపోయినై. జబ్బు మనిషికివచ్చేవి జబ్బు ఆలోచన లంటారు. యిందాకణ్ణుంచీ తను ఆమెనుగురించే ఆలోచిస్తూ వుండటంచేత ఆమె మాటనుకొని పొరపాటుపడ్డానేమో అను కుంటూ ముసుగుగా కప్పుకున్న శాలువా తీసేసి లేచి కూర్చు న్నాడు పైవైపునుండీ చంద్రే నచ్చి నిలబడివుంది. పొరపాటు కాదు తను అనుకున్నది.

"అరే, మీరా! శాలువా ఒకలాగేవుంటే గుమాస్తా గారి తాతగారనుకున్నాను......" ఆమె పాపం సిగ్గుపడి, నిలువలేక ఆ రెండుమాటలూ అలా చెబుతూనే గబగబా కదిలింది.

"చంద్రీ, మాటమాట. ఒక్కసారి నిలబడు" అన్నాడు మూర్తి.

ఆమె వెనుదిరిగిచూసింది కానీ మళ్ళీ రెండడుగులు ముందుకువేసింది. తండ్రి యింట్లోలేకపోయినా ఆయనకు తను ఒంటరిగా భోజనం పెడుతూనే వుందిగాని, యిలాంటి పరిస్థితి ఎన్నడూ కలుగలేదు.

"ఒంటరిగా కనుపిస్తేచాలు 'నే ప్రేమించా' నని చెబు తారు మొగవాళ్ళు. తరువాత ఒకొక్కప్పుడు తిన్నగా జర

గొచ్చుగాని నూటికి తొంభైతొమ్మిదిసార్లు ఈ ప్రేమలు సవ్యంగా సాగక, సరిగా వేశామనుకున్న అడుగు తప్పడు అడుగై పోతుంది. అందులోనూ అంతస్థుల బేధాలు. ఇలాంటి పరిస్థితులకు దూరంగా వుండాలి" అనుకుంది.

'చంద్రీ' అని అతను పిలవటం ఆమె విన్నప్పుడు ఆమె కొంచెం సిగ్గుపడింది. అదోరకంగా తియ్యగా వుంటుం దనుకొందిగాని 'చంద్రీ' అని తనపేరును యిష్టమొచ్చినట్లు పిలవటం ఆమెకు బాగుండలేదు. కొంత అనవసరపు స్వాతం త్ర్యాన్ని అతను పుచ్చుకుంటున్నాడేమో అనిపించింది. అయినా ఆ విషయం చెప్పటం ఎలాగ? నిలబడి మెల్లగా "ఏమిటి!" అంది.

"ఏంలేదు. యిలా సంకదారివైపునుండీ వస్తూవుంటే ఎక్కణ్ణుంచి వస్తున్నారోనని. అయితే చంద్రీ......"

"నన్నలా 'చంద్రీ' అని పిలవకండి మీా యిష్టమొచ్చి నట్లుగా. ఎవరైనా వింటే ఏమనుకుంటారు. పిలిస్తే పూర్తి పేరుతో పిలవండి."

"మీాపేరు 'చంద్రి'కదూ; మీారే చెప్పారు."

"ఎప్పుడు?"

"నేను క్రొత్తగా వచ్చినప్పుడు 'మస్తరు' చూసి కూలీలెవరో తెలుసుకుంటూవుంటే 'మరి నీపేరేమిటి' అని అడిగినప్పుడు 'నా పేరు చంద్రి' అని గబుక్కున; 'అయినా నే నిక్కడ పనిచేసే మనిషినికాను' అనటం జ్ఞాపకంలేదు!" అన్నాడు.

"ఓహో అదా! నాపేరు చంద్రికాదు. చంద్రిక నా పేరు. చంద్రి అని సగంచెప్పిన తరువాత మీరు నన్ను మీ కంపెనీ పనిమనుష్యులలో ఒకరనే ఉద్దేశ్యంతో అడుగుతున్నారనే విషయం గ్రహించి పూర్తిగా చెప్పకుండానే 'చంద్రి' అని ఆపేశాను."

"కానీ నేనుమాత్రం మీపేరు అంతవరకే విన్నాను గనుక 'చంద్రి' అనే అనుకుంటున్నాను. అలా అయితే యింకెప్పుడూ అలా పిలవనులెండి" అన్నాడు.

'పోనిలెండి నేనే పొరపాటున మీ రలా పిలవాలని పిలిచారనుకున్నాను. పొరపాటుపడ్డాను. ఏమీ అనుకోకండి' అని చెబుదామనిపించింది. కాని మాటలు పెదిమదాటి బయటకు రాలేదు.

"ప్రొద్దుగూకిపోయింది" అనుకుంటూ వెళ్ళిపోయింది అడుగులు తడబడుతూ.

అవును తనే పొరపాటుగా తనకంటే చిన్నదనే వుద్దేశ్యంతో పేరుపెట్టి పిలిచాడు. పరాయియింటి బిడ్డను గౌరవంగాపిలవాలిగాని తన కయినవాళ్ళను పిలిచినట్లు పేరుపెట్టి పిలిస్తే ఏం బాగుంటుంది? ఆమెపేరు ఒకవేళ చంద్రిక కాక 'చంద్రి' అయినాకూడా చంద్రీ అని పిలిచేహక్కు తనకు లేదు. అందుకని 'ఏమండీ' అని పిలవటమే సమంజసమనుకున్నాడు.

ఆలోచిస్తూ అలా కూర్చునేవున్నా అలాగే యింకా ఎగశ్వాసగానే వుంది. క్రిందకూర్చోలేక యింటికెళ్ళి వాలు కుర్చీలో పడుకోవాలనుకొని లేచాడు.

ఇంటికెళ్ళేసరికి చంద్రం యింటిదగ్గరున్నాడు.

"బావా! శనివారం మధ్యాహ్నం మీఫ్టారు బలేగా వుంది బావా! అక్కడ క్లబ్బు బలే సందడిగావుంది; నేను చూశాను. నీవు వుత్త 'ఎర్తుమువింగు మెషనరీని చూపించావుగాని; హెవెన్ మేకింగుమెన్'ని చూపించలేదు." అన్నాడు చంద్రం.

ఇంగ్లీషుని తన యిష్టమొచ్చినట్లు నాల్లాడుతూ ఈ మెషినరీతో వున్నవ్రాణిని స్వర్గంచేస్తున్న మనుషులు వాళ్ళు అని చెప్పటాని కనాను యింగ్లీషుపదాలు వాడటంలో కూడా చంద్రం చిలిపితనమే కనుపించింది.

"కాలేజీకి పోతేగాని నీ చిలిపితనం, చిన్నతనం వదలవురా బావా" అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"పద! కుర్చీలో కూర్చుంటున్నావ్ నీ పనులు తొందరగా కానీ. వెళ్ళి భోంచేసివద్దాం" అన్నాడు చంద్రం.

"ఏం భోజనంగా. తిన్నదానికే మధ్యాన్నమంతా బాధ పడ్డాను. ఈ రాత్రికి నే భోజనంచేయను. నీవు వెళ్ళి తినిరా. పెందరాడే పడుకుంటే ఉదయం ట్రైనులో గుంతకల్లు వెళ్దాం. నీవు రేపు సాయంత్రంవరకూ అక్కడవుండి అక్కడనుంచి వెళ్ళిపోదువుగాని. నేను రేపురాత్రికి యిక్కడకువచ్చి ఎల్లుండి ఉదయం సికింద్రాబాద్ వెళ్ళి మెస్సర్స

వాల్టాన్ కంపెనీలో కొన్ని మెషినరీభాగాలకు 'ఆర్డరు' చేసి రావా" అన్నాడు.

"అయితే నే నొక్కణ్ణే నన్న మాట భోజనానికి వెళ్లేది" అన్నాడు చంద్రం.

"ఊఁ" అన్నాడు మూర్తి రగ్గుకప్పుకొని పడుకుంటూ. కుర్చీలోనే చంద్రం వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

మర్నాడు వుదయం ట్రైనులో వెళ్తున్నప్పుడు చంద్రం "బావా! నీవు పాపం భోజనానికి రాలేదని ఆమె రెండు మూడుసార్లు అనుకొంది" అన్నాడు.

"నాకు రాత్రి ఏమీ బాగుండలేదు. పగలు ఎంత బాధపడ్డానో నీ కేం తెల్సు! రాత్రి భోజనం చెయ్యలేదు గనుక నే యీపూట లేవగలిగాను."

అంతటితో సమాధానం కట్టిపెట్టాడేగాని ఆ విషయాన్నిగురించి ఆలోచింపలేకుండామాత్రం ఉండలేకపోయినాడు. ఎంత పొరపాటునయినా తనొక నేళ పేరుపెట్టి పిలిస్తే నిష్కర్షగా 'పేరుపెట్టి పిలువవద్దు' అని చెప్పగలిగిన ఆ అమ్మాయి మళ్ళీ భోజనం చేయలేదనిమాత్రం రెండుమూడుసార్లు అనుకుందట. బహుశా ఆమె కొన్నిహద్దులు నిర్ణయించుకొని వుంటుంది. ఆ హద్దులోపల ఎంతవరకు వుదాత్తత చూపించాలో, ఎంతవరకూ ఉదాసీన భావంవహించాలో అంతవరకు తప్పకుండా వహిస్తుంది. ఆ హద్దు అతిక్రమించి ఎవరైనా మరో అడుగుముందుకువస్తూ వుంటే అక్కడే అడ్డం

వేస్తుంది. రోజూ భోజనంచేసే తను—రాకపోతే బాధ్యతా యుతంగాగాని బాధగాగాని 'రాలేదు' అనుకుంది. కాని పేరు పెట్టి పిలిచేందుకు వీలులేదుఅంది. ఆ రెండుహద్దులకీ మధ్య వున్న మనిషి ఆ అ శ్రయం టే— అనుకున్నాడు.

చంద్రం ఆరోజు సాయంత్రం వరకు వుండి వెళ్ళి పోయాడు గుంతకల్లునుంచి. మూర్తి అతన్ని పంపించి రాత్రికి వెనక్కు తిరిగి యింటికి వచ్చేశాడు. ఆరోజు రాత్రికికూడా అతనికి భోజనంచేయాలి అనిపించలేదు. అభోజనంగా పడుకుండి పోయాడు. ఉదయం లేచేసరికి కొంచెం తేలికగానే వున్నదని పించింది. తెల్లవారుఝామునే లేచివెళ్ళి స్టేషనుదగ్గరున్న హోటల్లో కాఫీమాత్రం తాగి మళ్ళీ మిషనరీయార్డుకొచ్చి కావలసిన ఆఫీసుకాగితాలన్నీ సర్దుకొని గుంతకల్లువెళ్ళే ట్రయి నుకు బయలుదేరాడు. స్టేషనుకెళ్ళింతరువాత జ్ఞాపకమొచ్చి తాను హైద్రాబాదు వెళుతున్నాననీ మూడురోజులవరకూ రానని పూర్ణానందంగారింటికి కబురుపంపాడు.

మూడురోజుల్లో అనుకున్నట్లుగా హైద్రాబాదు పనులు అయిపోయినయ్‌గాని స్టేషనుకొచ్చేసరికి వళ్ళు స్వాధీనంలో లేదు. జ్వరం వచ్చినట్లనిపించింది. వళ్ళు విరగలాగటం మొద లెట్టింది. ఎలాగో టిక్కెట్టుకొనుక్కుని రైల్లోపడ్డాడుగాని ఎగశ్వాస అతణ్ణి నిమిషంకూడా విడువకుండా ఉక్కిరిబిక్కిరి చేసేసింది.

రాత్రి ప్రయాణం ఎలాచేశాడో భగవంతుడికే తెలి యాలి. దానికితోడు ఊపిరాడని దగ్గు. యింటికొచ్చి కాగి.

తాలన్నీ సర్ది ఒకచోట పడేసి క్యాంపుకాటుమీద ప్రక్క అయినా సర్దకుండానే పడుకున్నాడు. రాత్రంతా పడినబాధ, ప్రయాణం బడలిక అతనికి కొంచెం నిద్రనిచ్చాయి. సాయంత్రందాకా అతను వచ్చిందీ రానిదీ ఎవరూ పట్టించుకోలేదుగాని సాయంత్రాం లక్ష్మమ్మ వచ్చి చూసివెళ్ళి కాస్తంత కాఫీ తెచ్చియిచ్చింది. కానీ అది అతనికి రుచించనేలేదు

మర్నాడు ఉదయం మేనేజరుగారు మూర్తిని డాక్టరు దగ్గరకు వెళ్ళిరమ్మని వేన్ పంపించారు. మూర్తి కాగు పడుకొని పన్నెండు మైళ్ళు ప్రయాణంచేసి అనంతపురం చేరుకున్నాడుగాని దానికే మరింత హైరాణపడ్డాడు.

డాక్టరు విపులంగా అతని నాలుగైదురోజుల కార్యక్రమాన్ని విని "మీరు మీ ఆరోగ్యాన్నిగురించి ఏమీ శ్రద్ధ తీసుకుంటున్నట్లు తోచదు. చూడండి అసలే అతి వృష్ణతత్వం మీది. దానికితోడు ఎస్నోఫిలియా వుందిగదా. విశ్రాంతి లేకపోవటం అతివృష్ణాన్ని పెంచింది. ప్రయాణంకూడ విశ్రాంతి లేమికి మరింత తోడ్పడింది. హైదరాబాదులో మూడురోజులు చన్నీళ్ళ స్నానంచేసి గోధుమరొట్టెలు తిన్నారు. వేళకు తినకుండా తిరిగారు. ఇంకేంకావాలి. పదిరోజులపాటు శెలవుపెట్టి మీవూరు మీ యింటికిపోయి విశ్రాంతి తీసుకోండి" అన్నాడు

మూర్తి తిరిగి వచ్చేశాడుగాని తనవూరు వెళ్ళాలని అనిపించలేదు. అలానే మరో రెండురోజులు గడపటానికి నిశ్చయించుకున్నాడు. అంతగా వుండలేని పరిస్థితి ఏర్పడితే

అప్పుడే పోవచ్చును అనుకున్నాడు. క్రొత్త ఉద్యోగంకదా అని అతని బాధ!

రెండు రోజులు చూచినా యింజెక్షన్లు, టేబ్లెట్లు ఏం పని చేసినట్లు కనిపించలేదు. యింకా శ్వాస కష్టమైపోయింది. నరాలన్నీ బిగుసుకుపోయి మంచంమీదనుండి కదలలేనట్లు చేసినై. దగ్గు మాత్రం ఊపిరాడకుండా వచ్చి వేధిస్తోంది. దగ్గుతో బాటు చిక్కగా కళ్ళె, ఊపిరి తిత్తులలో మంట.

యిక యింటికి వెళ్ళటానికి నిశ్చయించుకొని డబ్బు యివ్వడానికి పూర్ణానందంగారి యింటికి కబురు పంపితే ఆయన వచ్చాడు. బలవంతంమీద ఆయన అత నిచ్చిన డబ్బు హోటలు రేటుప్రకారం తీసుకున్నాడుగాని చంద్రం వున్న వారం పదిరోజులకు పుచ్చుకోవటానికి మాత్రం ససేమిరా వీల్లేదన్నాడు చివరకు "అట్లా తీసుకుంటే మా అమ్మాయికి కోపం వస్తుందండీ" అంటూ వెళ్ళిపోయాడు.

ఒక బెడ్డింగు మాత్రం సరిగా సర్దించుకున్నాడు మూర్తి. సరిగ్గా వెళ్ళిపోబోతున్న సమయంలో గుమ్మాని కెదురుగా పూర్ణానందంగారి అమ్మాయి వచ్చి నిలబడింది.

"రండి! కూర్చోండి" అన్నాడు మూర్తి ఏమనాలో తెలియక. తన యింటికి ఆ అమ్మాయి యింతవర కెప్పుడూ రాలేదు. ఒకవేళ తండ్రి పుచ్చుకున్న డబ్బు గురించేమో! ఆయన యిందాకనే కూతురికి కోపంవస్తుందంటూ వెళ్ళాడు అనుకున్నాడు.

"మీరు వూరు వెళుతున్నారట. మీకు ఆరోగ్యం ఇంతగా బాగుండలేదనీ నాకు తెలియదు. ఆ రోజు రాత్రి కూడా మీరు భోజనానికి రాలేదు. హైదాబాదు వెళుతూ కూడా భోజనం చేసిపోలేదు మళ్ళీ రానటం పుట్టెడుసు స్తితో వచ్చారు. మీరు మళ్ళీ వచ్చి మా యింట్లో భోజనం చేసే వరకు నాకు సంతృప్తి వుండదు. నాన్నగారు మీ ఆరోగ్యం మరీ చెడిపోయి బాగా బాధపడుతూ యింటికి వెళ్ళిపోతున్నా రంటే చూసిపోదామని వచ్చాను........." ఒక్క క్షణ మాగిం దామె.

"మా యింట్లో భోజనం సరిగా కుదిరిందో లేదో! పాపం మీ ఆరోగ్యం మటుకు మరీ పాడైపోయింది. ఈసారి యింటిదగ్గర్నుండి ఎవర్నయినా తీసుకొనివస్తే మీకు కాస్త స్వతంత్రంగా చేయించుకొని తినటానికి వీలవుతుంది...... మాకు చేసిపెట్టటానికి కష్టంగా వుండి అలా చెబున్నా ననుకో కండి...... తెలిసో తెలియకో, గబుక్కున మీ రలా పేరు పెట్టి పిలిస్తే నా మీద లేని చనువు తీసుకున్నారని అదో రకంగా బాధపడ్డాను గాని నే నన్న మాటలకు మీ రెంత నొచ్చుకున్నారో తర్వాతగాని వూహించలేదు. చిన్నదాన్ని-నన్ను మీరు పేరుతో పిలిస్తే తప్పేముందిలెండి! అదీగాక మీరు యివాళ నన్ను 'ఏమండీ' అని పిలుస్తుంటే నాకే బాధగావుంది. అది మనస్సులో వుంచుకోకండి......మీ ఆరోగ్యం ఎలావుందీ నాన్నకో వుత్తరం వ్రాయండి..."

అత నామె వంక తేరపారజూశాడు. ఆమె అతనితో యిన్ని మాటలు మాట్లాడటం చాలా అరుదు. ఈవిధంగా

మాట్లాడటం మొదటిసారి. తల పూర్తిగా దింపేసుకొని మాట్లాడింది. ఆమె మొఖంలో భావా లేమిటో అతనికి అర్థం కాలేదు; ఒక్క బాధపడుతున్నట్లు వుండటం తప్ప. ఆమె మొఖంలో మామూలుగా ఒక నిండుతనం వుంటుంది. అంతకంటే వేరే భావమేమి కలుగలేదు. కాని యిప్పటి ముఖ కవళికల్లో కొంత భారాన్ని మోసి దించినట్లుగా మాత్రం అనిపించినై.

"అలాగే....." అన్నాడు మూర్తి గడియారం చూసుకుంటూ.

"కాఫీ తయారయి వుంది. వెళుతూ వెళుతూ అలా మా యింటి దగ్గర కొంచెం తీసుకొని వెళతారా?"

అతను తన పరిస్థితినిబట్టి అక్కడిదాకా వెళ్ళలేనేమో అనుకున్నాడు గాని 'యిక్కడికే పంపించండి' అనటం మర్యాద కాదనుకున్నాడు. అందుకని "సరే పదండి" అన్నాడు.

ఆమె అతను అలా పిలవటంతో మళ్ళీ నొచ్చుకుంది. "ఈయన యింతలో ఎంతగా మార్చుకున్నారు" అనుకుంది.

మూర్తి అరగంటకంతా ట్రైనులో వున్నాడు.

◆ ◆ ◆

"యిప్పుడైనా 'చంద్రీ' అని పిలవటానికి రాణీగారు అనుమతిస్తారా?" బలవంతపెట్టి పికారుకు తీసుకొస్తూ మూర్తి అడిగాడు చంద్రికను.

"నా అనుమతితో పనేముంది; అయినా నే నారోజునే మీ యిష్టమొచ్చినట్లు పిలువమన్నానుగా. యిప్పటివరకూ ఎందుకు?"

"అవునౌను! పిలవమన్నావు. యింకా నయం మరొక సారి అలా పిలిచివుంటే చంప ఛెళ్ళున మోగించేదానివి. అందుకనే అలా చంప ఛెళ్ళుమనిపించుకోవటం ఎందుకనే 'లైసెన్సు బిళ్ళ' కట్టేశాను మెళ్ళో! ఏమంటావ్?"

"అనేందుకేముంది! జబ్బు చేసింది; యింటికెళ్ళి వస్తానని వెళ్ళి గారాబు అల్లుడుగారు మేనత్తగారి దగ్గర మారాము చేసి పెళ్ళి పెద్దలతో సహా తరలివచ్చారు" అంది చంద్రిక మెళ్ళో మంగళసూత్రం చేతిలోకి తీసుకొని కళ్ళకద్దుకుంటూ.

"మరి వెళ్ళేరోజున అన్ని రోజులు మూగగా వుండే తమరు ఉపన్యాసం దంచారుగా! చాలా పొరపాటైందని బాధ పడ్డారుగా! మళ్ళీ వచ్చి మీ యింటిలోనే వున్నా చూస్తావని సెలవిచ్చారుగా! ఒకవేళ ఆ వుండటంలో ఎక్కడ పొరపాటు పడి ఏంచెయ్యాల్సొస్తుందో అని ముందే జాగ్రత్త పడటం మంచిదని పెద్దవాళ్ళను తీసుకొచ్చాను. మరి చిన్నపిల్లవాణ్ణికదూ! నాకేం తెలుసు."

"అవును పాపం! మీరేమీ ఎరుగరు. పసిపాప; సంగనాచి. నోటిలో వేలుపెడితే కొరకలేరు గూడా..."

"నిజం! నోట్లో వేలుపెడితే కొరకలేను. గులాబీ బుగ్గలనిమాత్రం......"

"చాల్లేండి నేర్చారు మాటలు..."

"నేనా; నువ్వా నేర్చింది మాటలు. యిదివరకు యిన్ని మాట్లాడేదానివా నువ్వు ?"

"యిదివరకు యిన్నిమాటలు మాట్లాడాల్సినపని నా కేముంది. మీరు రిచ్చే ముప్పయిరూపాయలకు భోజనంకాక మాటలుకూడా కొనుక్కుందామనుకున్నారే. మా దగ్గర!" ఆమె మెల్లగా నవ్వింది.

"ముప్పయిరూపాలతో భోజనం తప్ప మాటలు కొనుక్కోలేక పోయాయినానుగాని; మూగగా నీవు మూడు వందలరూపాయల వుద్యోగస్తుణ్ణి ముకుకు తాడువేసి ఆడించటల్లా ?"

"నే నేమీ ఆడించటల్లా! మీరే ఆడుతున్నారేమో గాని."

"నేనే ఆడుతున్నా నీకబుర్లు విని—సన్నాయి మేళానికి గంగిరెద్దులాగ! మరి యీ కబుర్లు అప్పుడుకూడా చెప్పలేక పోయినావా. అప్పుడుకూడా యిలానే ఆడేవాడిని"

"అప్పుడు కబుర్లుచెప్పాల్సిన అవుసరం నాకేమిటి? ......ఏమండీ! అయితే నే నలా మీకు కబుర్లుచెబుతూ వుంటే మీ ఆటలో ఆనందంపొందుతూ హాయిగా గడుపుతూ అలా కాలం వెళ్ళబుచ్చుకొని పోయేవారుకాని అసలు చివరకు నన్ను యింతతొందరగా పెళ్ళిచేసుకొనేవారేనా ?"

"అయితే ముందే ఎత్తువేసుకొని మూగనోము పట్టా వన్నమాట. అవునులే కాకపోతే చంద్రంతో 'నన్ను అక్కా

అని పిలవనుని ఎవరన్నారు నీతో' అని అడుగుతావా నీవు-ముందే వూహించుకున్నావ్."

"ఏమీకాదు! ఒకవేళ మీరలా ఊహించుకొంటూ వుండిపోదామనుకున్నారేమో సాగదని చెప్పా."

"ఇప్పుడు సాగిందిగా!"

"ఊహాలోకాల్లో ఊగటం సాగిందా ఏమిటి? నన్ను మీదాన్ని చేసుకోవటం సాగిందిగాని!"

"అమ్మదొంగా చాలా పెద్దదానివేనే!"

"పెద్దదాన్నికాబట్టే మిమ్మల్ని నెగ్గాను. చిన్నపిల్లనయితే చిలిపిచేష్టలుచేసేవారుకారు మీరు?"

"ఇహ నీతో మాట్లాడలేను నేను."

"కాని నేను యింకెప్పుడూ యిలా మిమ్మల్ని మాట్లాడిస్తూనేవుంటా! ఆఫీసుపనికూడా చేసుకోనీకుండా మాట్లాడిస్తూవుంటా! నాకు మూడోందలు యిస్తోంది మీ రందుకేగా."

"ఉహూ! మా ఉద్యోగుల్ని మే మలా వాగించి అలసటపెట్టం. పైగా అలా మాట్లాడి అలసిపోతూవుంటే నోరు ఇలా మూసేస్తాం" ఆమె పెదవుల్ని తన పెదవులతో మూసేశాడు గట్టిగా. ఆమె పరవశంతో కళ్ళుమూసుకుంది.

క్రోటన్సుచెట్లులాగా గుబురుగా వలయాలుగా వున్న ఈతచెట్ల నడుమలో యిసుకమీద కూర్చున్న గుమాస్తాగారి తాతయ్య ఆపుకోలేక గబుక్కున నవ్వేశాడు.

చంద్రిక ఒక్కసారి కౌగిలనుండి విడిపించుకుని యిటూ అటూచూసి తల దించుకుంది సిగ్గుతో.

♦ ♦ ♦

గార్లదిన్నె మిషినరీయార్డులో కంపెనీ కంట్రాక్టు తీసుకున్న మెషినరీ షెడ్డులు, మెషినరీ బిగింపుపని అయిపో యింది.

పనివాళ్ళందరినీ కంపెనీ క్రొత్తగా కాంట్రాక్టుకు తీసుకున్న మరో వర్కుషాపు నిర్మాణానికి రావాలిసిందిగా కంపెనీ కోరింది, అందరూ అక్కడికి తరలివెడుతున్నారు. మూర్తికున్న ఉద్యోగార్హతల కారణంగానూ, అతను చూపించిన బుద్ధికుశలత, చురుకుదనాల కారణంగా అతనికి గవర్నమెంటువారే ఉద్యోగమిచ్చి గార్లదిన్నెలో పూర్తయిన వర్కుషాపులో ఒక ముఖ్యఉద్యోగిగా నియమించారు.

పూర్ణానందానికి, కంపెనీవారు క్రొత్తగా నిర్మాణా నికి పూనుకున్న వర్కుషాపులో చేరితే హెచ్చుజీతమస్తామని తెలియజేశారు.

తండ్రీ కూతుళ్ళలో ఏ నిర్ణయం జరిగినా మరొకళ్ళకు ఆ నిర్ణయంపట్ల చాలా గౌరవం. ఒకవేళ తద్భిన్నంగా మరొక అభిప్రాయం కలిగితే సూచనప్రాయంగా ఆ చేసిన నిర్ణయంపై తను అభిప్రాయాన్ని వెలుబుచ్చటమేగాని వత్తిడి చేసి నిర్ణయాన్ని మార్పుచేయాలనే తత్వం—పూర్ణానందం, చంద్రికల్లో—యిద్దరిలో ఎవ్వరికీలేదు. దీనికి కూతురుమీద

తండ్రికున్న ప్రేమ, తండ్రిమీద కూతురికున్న గౌరవం కారణాలు.

అందుకనే, ఇన్నాళ్ళనుంచి తల్లి లేకపోయినా పెంచి పెద్దచేసిన తండ్రి తనను వదలి వెళ్ళిపోతున్నాడంటే లోలోపల బాధపడినా ఏమీ అనలేక వూరుకుంది. కానీ వూరుకుండలేక ఒక్కసారిమాత్రం అని చూచింది "నా అన్నవాళ్ళెవరూ లేని నాకు నీవుకూడా దూరంగావుంటే ఎట్లా నాన్నా!" అని.

"అమ్మా మామూలు ప్రపంచంలో బ్రతికేవాళ్ళకు చుట్టాలు, పక్కాలు, స్నేహితులూ, నౌకర్లూ, చాకర్లూ. యిలా అరణ్యాలలోపడి బ్రతికేవాళ్ళ కెవరు తల్లీ? తల్లి లేక పోయినా ఏదో యిన్నాళ్ళు నాచేతనయినట్లు పెంచాను. అయితే నా అనేవాళ్ళు వేరెవరూ లేకపోయినా ప్రపంచంలో మనం పాటించాల్సిన ధర్మాలు కొన్నివున్నాయి. కన్ను, కాలు పడిపోయింతరువాత, శ్రాద్ధున ఎట్లాగూ నీ దగ్గరకు రావల్సిందే. ఆమాత్రం ఆసరా భగవంతుడు నాకిచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. కాని కాళ్ళు, చేతుల్లో ఓపికున్నంతవరకూ పనిచేయాల్సిందే తల్లీ! అల్లుడుకూడా చాలా మంచివాడు. నా జీవితంలో ఏపనిచేయటంలో చాలా కష్టపడాల్సొస్తుందనుకున్నానో ఆపని దానంతట అదే సులభంగా అయిపోయింది. యిక నాకే దిగులులేదుతల్లీ! నేనిక్కడ లేకపోయినా కాకిచేత కబురుపంపితే రానూ! అల్లుడుమాత్రం నిన్ను పంపిస్తూ వుండరూ! ఫర్వాలేదుతల్లీ! నా అన్నవాళ్లెవరూ లేరనుకోవద్దు. వీళ్ళంతా నివాళ్ళే. పిన్న

గారూ వాళ్ళు నిన్ను చూస్తూవుంటారు. అయినా నీకే నలుగురు పిల్లలు పుడితే వాళ్లే నీ యింటినిండా వుంటారు" అన్నాడు పూర్ణానందం సంతోషంగా ఊహించుకుంటూ.

మర్నాడు వుదయం తండ్రి వెళ్ళటానికని ఆమె అన్ని ప్రయత్నాలూచేసింది. పూర్ణానందం మధ్యాహ్నం బండీలో అనంతపురం వెళ్ళి కూతురుకో చీరె వగైరా తెచ్చాడు. రాత్రి భోజనానికి ముందు గోడ గూడులో పుస్తకాల కొయ్యపెట్టెల్ని రెంటినీ దింపి క్రింద బెట్టి పైనున్న దుమ్ము దులిపి మూత తీశాడు. లోపలకు కళ్ళు చూడలేకపోయినై. గొంతు ఒక్కసారిగా బిగుసుకుపోయినట్లయింది. గబగబా రెండో పెట్టె మూతకూడా తీసిచూశాడు. అతనికి కళ్ళనీళ్ళు ఆగలేదు. ఉద్యోగంలో చేరిననాటినుండి కొని, ప్రాణప్రదంగా కాపాడుకుంటున్న పుస్తకాలన్నీ చదలపాలైపోయినై. ఆ పుస్తకాల ముక్కలలోనుండి చెదలు గుట్టలుగా పైకి ప్రాకి రానారంభించాయి. పోనీ ఆశతో లోపలేమన్నా కొట్టని పుస్తకాలున్నయేమోనని చేయి పోనిచ్చి చూశాడు. గాని అడుగున పుస్తకాల మాట అటుంచి అసలుపెట్టెకే అడుగు లేకుండా కొట్టేసింది చెదలు.

అతని కళ్ళవెంబడి నీళ్ళు ఆగక కట్టలు తెంచుకొన్న చెరువులాగా వచ్చినై. పెద్దవాడై వుండికూడా చిన్నపిల్లవాడిలాగ పొర్లుకొచ్చే దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. ఒకసారి చనిపోయిన భార్య జ్ఞాపకాని కొచ్చింది. పెట్టె మూత తీసేసరికి యివాళ ఎంత నిరాశకు గురికావలసివచ్చిందో తన

భార్య చావు అప్పుడూ అంతే. నిండుగా మనిషి వున్నట్లే వుండి ఒక్కసారిగా మనిషి మాయమైపోయింది. ఈ పుస్తకాలన్నీ ఆమె క్షుణ్ణంగా చదివింది. తను తన వుద్యోగంలో పడి పగలంతా సతమాతూవుంటే ఆమె అమ్మకు పుట్టి పెరిగేదాక చివరకు చచ్చేదాకా వీటితో కాలక్షేపం చేసింది. తన బిడ్డకు తల్లి దక్కినట్లే తల్లి పుస్తకాలు—ఈ విచిత్ర ప్రపంచంలో చివరకు కూతురికి దక్కలేదు.

"ఏమిటి నాన్నా అట్లా వున్నావ్?" అని కూతురు వచ్చి అడిగేదాక అట్లా కళ్ళనీళ్ళు కారుస్తూ కూర్చునే వున్నాడు. కూతురిమాట వింటూనే "ఏమీ లేదమ్మా! ఏమీ లేదు. నా కున్న సర్వస్వం చెదలుపాలై పోయింది. పగలంతా చేసే బండచాకిర్ని, ఈ వెధవ మెషినరీ గొడవ నంతా ఈ పుస్తకాలలో పడి మరచిపోయేవాణ్ణి. పగలంతా ఈ పుస్తకాలు ముందర వేసుకొని, వంటరిగా కూర్చోవాలని బాధపడకుండా గడిపేది మీ అమ్మ. మా యిద్దరికీ స్నేహితులకన్నా ఎక్కువగా సాయపడిన పుస్తకాలు పోయినయి తల్లీ" అన్నాడు బరువుగా.

అక్కడ కూర్చుండలేక పంచ పైన వేసుకొని గబగబా 'వంక' వైపుకి బయలుదేరాడు.

తనకూ, తన భార్యకూ జీవితమంతా ఆనందదాయకాలైన ఆ పుస్తకాలు వెళ్ళిపోతూ ఆమెకు ఒప్పగించాలనుకున్నాడు. కాని ఏం లాభం! తన పేదతనానికి మరో పరీక్ష

లాగ చివరి కా పుస్తకాలు యివ్వలేకపోయాడు. యిన్నాళ్ళ నుంచీ పెంచి పెద్దచేసిన తన కూతురికి డబ్బు దస్కం యివ్వ లేనందుకు బాధపడలేదుగానీ ఉద్యోగరీత్యా తన కూతుర్ని వదలిపెట్టి మరొకవూరు పోవలసి వచ్చినందుకు బాధపడలేదు గాని చివరిసారిగా తను, జీవితంలో ఆమెకు సాయపడతాయని తనూ తన భార్యలాగ జీవిత మంతా వాటిని ఉపయోగించుకొని కాలం గడుపుతోందని. అనుకున్న పుస్తకా లన్నీ మట్టిగా మారిపోవటంతో హృదయానికి తీరని బాధ కలిగింది. అతని దృష్టిలో ఆ పుస్తకా లన్నీ అమూల్యం !

అంతా కలసి నెలరోజులు వాటిని గూటిలో కెక్కించి, గదిలో అడ్డంగా వున్నాయనే తను ఆలోచించాడుగాని క్రొద్ది రోజులవరకు బీళ్ళుగావున్న యీ ప్రదేశాలలో యిళ్ళు కట్టు కొంవున్న తను వెధవ కిరసనాయిలు చెక్కపెట్టిలో వుంచితే అవి దక్కవని వూహించలేదు ఏ టేకి కర్రల కానడి పెట్టె లాంటి వాటిల్లోనో భద్రంగా దాచుకొనివుండవలసింది. ఏం లాభం! తన కవి దక్కే ప్రాప్తం లేదనుకున్నాడు. యింటికి పోయి భోజనం చెయ్యాలనిపించలేదు. 'వంక'లో ఈతచెట్ల మధ్యలోనే పడి నిద్రపోయాడు. కూతురూ అల్లుడూ కలిసి వచ్చి లేపేవరకూ నిద్రపోయావన్న సంగతే అతనికి తెలియ లేదు. అయిష్టంగానే లేచి వారివెంట యింటికి వెళ్ళాడు. కూతురూ, అల్లుడూ ఎంత బ్రతిమాలినా భోజనం మాత్రం చెయ్యాలనిపించలేదు.

ఉదయంలేచి కాలకృత్యాలన్నీ ముగించుకొని కూర్చున్నాడు పూర్ణానందం. పెట్టె, బేడ అంత సర్దుకోవట మైపోయింది. కంపెనీవాళ్ళందరితోబాటు వెళ్ళిపోవటానికి, కూతురు స్నానంచేసి వంటచేసి తులసిమొక్కలో నీళ్ళుపోయటానికి పెరట్లోకి వచ్చింది. ఆమె తులసిమొక్కలో నీళ్ళుపోస్తున్నంతసేపూ అలా చూస్తూ కూర్చుని చివరకు అన్నాడు. "అమ్మా! మీ అమ్మ నాకు ఒప్పగించినవాటిల్లో మిగిలింది యీ తులసిమొక్క ఒక్కటేనమ్మా. ఎప్పుడో బెంగుళూరు వెళ్ళినప్పుడు తెచ్చా నీ యిత్తడి తులసికోట. ఆరోజునుంచీ ఈరోజువరకూ తులసీపూజ యీ కోటలో జరుగుతూనేవుంది. నే నిక్కడ లేకపోయినా రోజూ తులసిని పూజిస్తూవుండమ్మా. మీ అమ్మకూడా సంతోషిస్తుంది. తులసి పసుపు, కుంకమను సదా రక్షించటంతోబాటు సంతానాన్నిస్తుందని అంటారు పెద్దలు. నేను నీకు వెళుతూ అప్పగింతపెట్టాల్సింది మీ అమ్మ పవిత్ర చిహ్నంగా, హిందూస్త్రీకి పరమ పవిత్రమైన ఈ తులసికోట తప్ప యింకేమీ లేకపోయింది. సరి కానీతల్లీ తొందరగా కానీ, నీవు భోజనంచేసి ఆచీరె కట్టుకుంటే నేను ఒకసారి చూసి సంతోషిస్తాను. మళ్ళీ నేను వెళ్ళటానికి లారీలు బయలుదేరే వేళవుతోంది" అన్నాడు.

ఆమె తులసీ ప్రసాదం తీసుకొని లోపలికి వెళ్ళిపోయింది.

◆ ◆ ◆

దరిదాపు సంవత్సరమైపోయింది; పూర్ణానందం వెళ్ళి పోయి. అప్పుడే ఆఫీసునుండి వచ్చిన మూర్తిని 'మా నాన్న దగ్గరనుండీ ఏమన్నా ఉత్తరం వచ్చిందాఅండి" అడిగింది చంద్రిక.

"లేదు ఆయ సేపనితొందరలో వున్నారో ఉత్తరం వ్రాయలేదు. దానికిగాను అంతభయపడటం దేనికి; రేపు ఎల్లుండిచూసి ఫోనులోపిలచి కనుక్కుంటానులే" అన్నాడు మూర్తి.

"పోనీ సంవత్సరమైపోయింది. ఒకసారి నేనే నాన్న దగ్గరకు వెళ్ళొస్తానండీ." తలవంచుకునే అడిగింది.

మూర్తి ఒక్కనిమిషం అదోరకంగా అయిపోయాడు. "అవును పాపం మామగారు వెళ్ళి సంవత్సరమైంది. అయినా మామగారైనా రాలేదు. సరే తనైనా భార్యను పంపించ లేదు—అనుకున్నాడు. ఆమె అడిగేదాకా అతని కీ ఆలోచన రానందుకు తనని తను మనస్సులోనే నిందించుకున్నాడు. "అరె! యిన్నాళ్ళనుంచి ఎప్పుడూ చెప్పలేదేం మరి! నాకూ యిన్నాళ్ళు తట్టలేదు సుమా! అయితే రెండుమూడు రోజుల్లో బయల్దేరుదువుగాని" అన్నాడు.

సాయంత్రం పొనుకు బయలుదేరుతున్న మూర్తి దగ్గర కొచ్చి "ఏమండీ" అని పిలిచింది చంద్రిక.

ఏమిటన్నట్లు చూశాడు మూర్తి.

"యివిగో యివి కావాలండీ మీరు ఊరునుండి వచ్చేటప్పుడు యివి తెచ్చిపెట్టండి" అంది.

"ఏమిటి ఏదో గమ్మత్తు కోరికలు కోరతారట ఆడవాళ్ళు వేవిళ్ళల్లో. నీ కోరిక మరీ గమ్మత్తుగావుందే! ఈ పుస్తకాలన్నింటిని నమిలి మింగాలనే" అన్నాడు నవ్వుతూ.

"నాకు కాదండీ. నాన్నకు. పాపం ఆయనవేనండి ఆరోజున ఊరికెళుతూ పుస్తకాలు చదలుపట్టిపోయినందుకు ఎంత బాధపడ్డాడో! రేపో ఎల్లుండో బయలుదేరుతున్నాను గనుక మీరీ పుస్తకాలు తెస్తే నాన్నకిస్తాను" అంది. మూర్తి ఆమెనుగురించి రెండుక్షణాలు ఏమిటో ఆలోచించుకున్నాడు.

♦ ♦ ♦

ఆరోజు చంద్రిక బయలుదేరుతోంది తండ్రిదగ్గరకు. మూర్తి ఆఫీసుకుపోతూ జవానునిపిలిచి భార్యని తీసికొనివెళ్ళి మూడుగంటలకు రైల్లో ఎక్కించిరమ్మని చెప్పాడు. మధ్యాహ్నం ఆఫీసుపనులన్నీ చూసుకుంటూవుండగా ఆఫీసుకు పోస్టుమన్ వచ్చాడు. "మీకు పార్సిలు ఒకటి వుందండీ, మీరిందాకవస్తే షెడ్డులో వున్నారని తెలిసింది. మళ్ళీ యిప్పుడు తీసుకొచ్చా"నంటూ పెద్ద పార్సిలు ఒకటి బల్లమీదవుంచి సంతకంచేయించుకొని వెళ్ళిపోయాడు, పోస్టుమాన్.

మూర్తి పార్సెలుమీద అడ్రసు చూచి మామగారి దగ్గర్నుంచి అనుకుంటూ పార్సిలు తీసిచూశాడు. పుస్తకాలు! పైన మడచిన దో వుత్తరంవుంది.

"చిరంజీవి సౌభాగ్యవతి అమ్మనుకి! యిందుతోబాటు కొన్ని పుస్తకాలు పంపుతున్నాను. ఆరోజు వస్తూ వస్తూ మన యింటిలోవున్న పుస్తకాలన్నీ నీకు యిచ్చివేద్దాం అనుకున్నాను. మీ అమ్మలాగే నీవుకూడా ఆ పుస్తకాలతో కాలక్షేపం చేయగలవనుకున్నాను. గాని ఈ పేదవాడికి ఆ ఆశ కూడా దక్కలేదు. ఈ సంవత్సరంనుండి ఎంత ప్రయత్నించినా పుస్తకాలు కొనిపంపటమూ పడలేదు. నీకు పిల్లలుపుట్టి వాళ్ళతో కాలక్షేపంచేసేదాక ఈ పుస్తకాలు నీకు స్నేహితులకన్నా ఎక్కువ వుపయోగపడతాయని ఆశిస్తున్నాను. వీలుగావుంటే కొద్దిరోజుల్లో మరికొన్నింటిని పంపగలను. అల్లుడుకీ, నీకూ నా ఆశీర్వాదాలు—

పూర్ణానందం.

ఉత్తరం పూర్తవగానే మూర్తి చేతివాచీవంక చూసుకున్నాడు. మూడుంబావయింది. జవానుని పిలిచి గుంతకల్లు వెళ్ళే రైలు వచ్చిందా అని అడిగాడు. యిప్పుడే వచ్చిందన్నాడు బంట్రోతు. పుస్తకాల పార్శిలును జవానును తీసుకొని రమ్మని క్యాష్‌బాక్సు తాళంవేసి గబగబా స్టేషను వైపుకు బయల్దేరాడు. మూర్తి స్టేషనుకు గబగబా నడిచాడు గాని మూర్తి ప్లాటుఫారంమీద అడుగు పెట్టేసరికే రైలు కదులుతోంది. కిటికీలోంచి చంద్రిక ప్లాటుఫారంమీదకు వచ్చిన మూర్తిని చూసి చేతులు వూపింది; తనను పంపించటానికి వచ్చాడని 'టాటా' చెబుతూ. మూర్తి ఒక్క క్షణం

మాత్రం ప్లాటుఫారంమీద నిలబడిపోయాడు. ఆ తండ్రీ కూతుళ్ళని, వారికి ఒకరిమీద ఒకరికి వుండే అనురాగాన్ని గురించి ఆలోచిస్తూ 'యింతటి అనురాగమూర్తులైన కుటుంబంతో పొత్తు కలియడం కోటినుంది బంధుత్వ మున్నంత' అనుకున్నాడు రైలు పోయినవైపే చూస్తూ.

'అమ్మగారికి ఉత్తరం రాయండి బాబూ పార్సిలు అందిందని' అనే జవాను మాటలు వినేవరకు అతను అల్లాగే నిలబడిపోయాడు.

(సమాప్తం)

---

**ADAVI PAGADALU** — An UDAYA SAHITI PUBLICATI

*By* S. HUNUMANTHA RAO — Rs. 2-0



జననం : ఏప్రియల్ 1936, కృష్ణాజిల్లా, వానపాముల.

నివాసం : విజయవాడ.

ఆంధ్ర విశ్వవిద్యాలయ అర్ధశాస్త్ర పట్టభద్రులు; నటన, వక్తృత్వం, సాహిత్యాలపట్ల అభిమానం, ఆసక్తి. జీవితపులోతుల్ని, సహృదయసమున్నతిని సందర్శించటానికి సాధన.

పత్రికల్లో వెలువడిన కథలు, వ్యాసాలు, గేయాల ద్వారాను, అభినేత్రి (కథలు), ధారాపాత్ర (గేయకవిత), పరాన్నభుక్కులు (నాటిక) ద్వారాను సాహిత్యరంగానికి పరిచితులు.

Krishna Central Divn.

WRAPPER PRINTED AT BHARATA MUDRANALAYAM, VIJAYAWADA - 2.